# తెలుగులో సాహిత్యవిమర్శ

సాహిత్యం ముందు పుట్టిందా సాహిత్య విమర్శ ముందు పుట్టిందా అన్న ప్రశ్నకు సాహిత్యమే ముందు పుట్టింది అని సహజంగా వస్తుంది సమాధానం. కాని అది సత్యంకాదేమో అనిపిస్తుంది. శ్రుతి ఇలా అంటున్నది.

"సో ఽ కామయత బహుస్యాం ప్రజాయేమేతి. స తపో
ఽ తప్యత స తపస్తప్త్వా ఇదగ్ంసర్వ మసృజత."

తైత్తిరీయోపనిషత్తు. 2:6

"స ఈక్షత లోకాన్ను సృజాఇతి స ఇమాన్ లోకాన్ అసృజత"

ఐతరేయోపనిషత్తు. 1:1:1

ఈశ్వరునకు ఇచ్ఛ కలిగింది "అనేకం అవుతాను. ప్రభవిస్తాను" అని. ఆయన తపస్సు చేసినాడు. తపస్సుచేసి ఇది అంతా సృజించినాడు.

ఆయన "లోకాలను సృజించుతాను" అని చూచినాడు. ఆయన యీ లోకాలను సృజించినాడు.

"య స్సర్వజ్ఞ స్సర్వవిత్
యస్య జ్ఞానమయం తపః"

అనటంవల్ల ఈశ్వరుని తపస్సు జ్ఞానమయము. అనేకమై ప్రభవించ వలెనన్న ఇచ్ఛ కలిగిన తరువాత ఆయన తపించినాడు, ఈక్షించినాడు. అనగా ఆలోచించినాడు, ఆలోకించినాడు. "జ్ఞాన మీక్షణమేవ తపః" అన్న వ్యాఖ్యాత వాక్యాన్నిబట్టి తపస్సు అంటే ఆలోచనము, తత్ఫలమైన ఆలోకనము అని ఏర్పడుతున్నది. ఇష్టార్థము జ్ఞాతమై, జ్ఞాతమైన అర్థము దృష్టమై, దృష్ట మైన అర్థము సృష్టమైనది అన్నమాట. ఆయన ఆలోచించి, ఆలోకించినవి లోక ములు. వానినే ఆయనే సృజించెను – ఆవిష్కరించెను. ఇచ్ఛా జ్ఞాన క్రియా రూపాలలో ఈశ్వరుని శక్తి క్రమంగా వికసించి లోకాలు ఆవిర్భవించునవి

కామితమునుగూర్చి ఆలోచించినప్పుడు ఆయన తపస్వి, కామితార్థాలను ఆలోకించినప్పుడు ఆయన ఋషి. "ఋషయః సాక్షాత్కృత ధర్మాణః" విశ్వ ధర్మముల సాక్షాత్కారం కలవారు ఋషులు. తాను సృష్టించగోరిన లోకాల ధర్మాలు సాక్షాత్కరించిన అనంతరమే ఈశ్వరుడు లోకాలను సృజించినాడు. సృజించినాడు అనగా తనలోనుంచి ఆవిష్కరించినాడు అని అర్థము.

వసిష్ఠ విశ్వామిత్రాదులుకూడ ఋషులే - ధర్మ సాక్షాత్కారం కలవారే. వారికి సాక్షాత్కరించిన ధర్మాలు ఈశ్వర సృష్టి ధర్మాలే - సృష్టికి పూర్వం ఈశ్వరునకు సాక్షాత్కరించి ఆయన సృష్టిలో సంక్రమించిన ధర్మాలే. తమకు సాక్షాత్కరించిన ధర్మాలను వారు యథాసాక్షాత్కృతముగా మంత్రాల రూపాన ప్రకటించి సత్యవచస్కులైనారు. వాల్మీకి వ్యాసులు కూడ ఋషులే. వారికి కూడ ధర్మములు సాక్షాత్కరించినవి. ధర్మములు అంటే విశ్వకర్మ నిర్మాణ మర్మములు. తమకు సాక్షాత్కరించిన ఈ ధర్మాలను వ్యాస వాల్మీకులు సూత్ర ప్రాయంగా ప్రపచించక భారత రామాయణ మహాకావ్య నిర్మాణ రూపాన సుందరంగా ప్రపంచించినారు. ధర్మ సాక్షాత్కారం లేనిదే కర్మ నిర్మాణం లేదు. కనుకనే 'నా నృషిః కురుతే కావ్యమ్'.

ఋషికానివాడు కావ్యం చేయడు. ఋషి అయిన ప్రతివాడూ చేస్తాడా అంటే చేయవచ్చు, చేయకపోవచ్చు, చేయలేక పోవచ్చుకూడా. జ్ఞానంవేరు, క్రియ వేరు. జ్ఞాత అయినవాడు కర్త కాకుండవచ్చు. కర్త అయినవాడు మాత్రం జ్ఞాత అయి ఉండాలి. అంటే కావ్యకర్మ నిర్మాణ మర్మజ్ఞుడే కావ్యకర్మ నిర్మాత కాగలడు. కావ్యకర్మ నిర్మాణ మర్మజ్ఞత అంటే క్లుప్తంగా కావ్యజ్ఞత. కావ్యజ్ఞుడైన కావ్య క్రియాదక్షుడు కవి. కావ్యక్రియాదక్షత లేని కావ్యజ్ఞుడు విమర్శకుడు. అనగా విమర్శకుడు కావ్యఋషి - కావ్య నిర్మాణ మర్మద్రష్ట. కవికి, విమర్శకునకు కావ్యనిర్మాణ మర్మదర్శనము సమాన ధర్మము.

కనుకనే నన్నయ తన కావ్యంలోని ప్రసన్న కథా కవితార్థయుక్తిని అరసి మేలనగలవారు సారమతులైన కవీంద్రులే అని వక్కాణించినాడు. "To judge of poets is only the faculty of Poets - not all poets but the best" అని Ben Jonson నుడివినాడు.

"యః సర్వజ్ఞః సర్వవిత్
యస్య జ్ఞానమయం తపః"

అన్న శ్రుతి ఈశ్వరునకు వర్తించునట్లు కవీశ్వరునికి కూడా వర్తిస్తుంది. కవి కావ్య తపస్వి – కావజ్ఞుడు, కావ్యవేత్త. కావ్య సామాన్య జ్ఞానం కలవాడు కావ్యజ్ఞుడు; కావ్యవిశేష జ్ఞానం కలవాడు కావ్యవేత్త. విశేషజ్ఞానం అంటే అనుభవపూర్వకమైన జ్ఞానం. విమర్శకుడు కూడా కేవలం కావ్యజ్ఞుడు కాక కావ్యవేత్త కావటం అవసరం. కావ్యజ్ఞుడైన విమర్శకుని విమర్శ బుద్ధివర్ధకం కాగా కావ్యవేత్త విమర్శ ఆనందవర్ధకం అవుతుంది. కావ్యజ్ఞుని విమర్శ శాస్త్ర సమ్మతము; కావ్యవేత్త విమర్శ కళా సమ్మతము, కాంతాసమ్మితము. కావ్యజ్ఞుడు కావ్యశాస్త్రిలు నిబంధించిన కావ్యలక్షణాలను అనుసరించి తటస్థ భావంతో కావ్య గుణదోషాలు వివేచించి, అది ఉపాదేయమో అనుపాదేయమో నిర్ణయిస్తాడు కావ్యవేత్త శాస్త్రానికి తన అనుభవాన్ని కూడా జత చేసి సానుభూతితో కావ్యాన్ని సమీక్షించి ఇది ఎందువల్ల ఎంతవరకు ఉపాదేయమో సహేతుకంగా నిరూపిస్తాడు. కావ్యానుశీలనా భ్యాసవశాన విశదీభూతమైన మనోముకురంలో ప్రతిబింబించిన కావ్యార్థంతో తన్మయీభావం పొందగల సహృదయునకు విమర్శకునితో పనిలేదు. ఆశక్తి లేనివారికి ఆ శక్తిని అలవరచటానికే విమర్శకుని అవసరం. ఉత్తమ కావ్యాన్ని ఆస్వాదించే నైపుణి అలవరించి సమాజంలో ఉత్తమ సాహిత్యాభిరుచి పెంపొందించేవాడు ఉత్తమవిమర్శకుడు. సమాజాన్ని సహృదయం చేసేది ఉత్తమ విమర్శ.

కవికి కావ్య రచన, విమర్శకునకు కావ్య విమర్శ వృత్తికాదు, వ్యాసంగము. ఆ వ్యాసంగంలో ఆసక్తుడు కావటానికి కారణం విశ్వశ్రేయస్సాధనేచ్ఛ, లోకానుగ్రహబుద్ధి. కవికి వలె విమర్శకునికి కూడా చిత్తశుద్ధి అవసరము. చిత్తశుద్ధిలేని కావ్యము వారకాంత వంటిది. చిత్తశుద్ధిలేని విమర్శ జారకాంత వంటిది.

కావ్య విమర్శలో కావ్యాంగ విమర్శ అంతర్భవించి ఉంటుంది. సాంగమైన కావ్య విమర్శ సమగ్రమైనది. అంగములను, అంగిని వేరువేరుగ విమర్శించవచ్చును. అది విమర్శకుని ఆశయంమీద ఆధారపడి ఉంటుంది. అసమగ్రత లోపమేకాని దోషంకాదు. సర్వాంగ సౌష్ఠవంకల కావ్యంలాగా

సర్వాంగ సౌష్ఠవంకల విమర్శకూడా దుష్కరము, దుర్లభము. కావ్యంలో లాగే విమర్శలోను అలోపత్వం కంటె అదోషత్వం అభిలషణీయము. ఉద్రిక్తత, పురోభాగిత, పక్షపాతిత విమర్శనలో క్షంతవ్యములు కాని దోషాలు. రసిక మధువ్రతాలను రసవత్కావ్యాల దిక్కునకు ఆకర్షించే సాహిత్య సౌందర్య గంధవహుడు విమర్శకుడు.

కావ్య నిర్మాణము కవికర్మ వేతృతా పూర్వకం కావడంవల్ల కావ్యం పుట్టకముందే కావ్యవిమర్శ పుట్టినట్లవుతున్నది. ఏ సాహిత్యంలోనైనా ఇంతే. తెలుగు సాహిత్యం విషయంలో ముఖ్యంగా ఇదే పరిస్థితి. తెలుగు సాహిత్యానికి, సాహిత్య విమర్శకి మూలం సంస్కృతమే. అందువల్ల తెలుగులో సాహిత్య విమర్శ సాహిత్యంతో పాటే పుట్టినది. మనకు తెలిసినంతవరకు తెలుగులో నన్నయయే ఆదికవి, ఆది విమర్శకుడు.

౨

రాజరాజ నరేంద్రుడు "ఉదాత్త రసాన్విత కావ్యనాటక క్రమములు పెక్కు చూచిన" కావ్యవేత్త. ఆయన ఆస్థానంలో పలువురు కవులు, కావ్య వేత్తలు ఉండిరి. వారిలో నన్నయ నారాయణభట్టు ఉండిరి. నన్నయ రాజరాజునకు కుల బ్రాహ్మణుడు, అనురక్తుడు. ఇరువురి అభిరుచి, చిత్తవృత్తి సదృశమైనవి. అంటే ఇరువురి కావ్యవేత్తృత సదృశమైనది. కనుకనే వ్యాస భారతాన్ని తెనుగున రచియించు పనిలో రాజరాజు నన్నయను నియోగించినాడు. ఆపనిలో నన్నయ నారాయణభట్టు సహాయం అర్థించినాడు. ఆయన నన్నయకు ఇష్టుడు, సహాధ్యాయుడు. ఇరువురి అభిరుచి, విద్య ఏకరూపములు. కనుక ఇరువురి కావ్యవేత్తృత ఏకరూపమే. రాజరాజువంటి సహృదయుడు, నన్నయ వంటికవి, నారాయణభట్టు వంటి విమర్శకుడు ఏకత్ర సమావిష్టులైన సన్నివేశంలోనించి మహాభారతం తెలుగులో అవతరించింది. నాటి విద్వత్కవి పరిషత్తులను మెప్పించినది. నేటికీ మెప్పిస్తూనే ఉన్నది.

ఉత్తమ సాహిత్య లక్షణాలను గురించీ, వ్యాస భారత లక్షణాలను గురించీ, తన భారత లక్షణాలను గురించీ నన్నయకు విస్పష్టములైన అభి

ప్రాయాలు ఉన్నవి అని ఆయన గ్రంథాలవల్ల విశదమవుతుంది. ఆంధ్రశబ్ద చింతామణిలో, ఆంధ్ర భారతావతారికలో ఆభిప్రాయాలు పొందుపరచబడి ఉన్నవి.

"విశ్వశ్రేయః కావ్యమ్
తదదోషౌ పరిష్కృతౌచ వాగర్థౌ
సావాక్యం రసవృత్తిః
సాధ్యోహి రసోయథా తథం కవిభిః"

ఇది నన్నయ కావ్య లక్షణ వివేకము. కావ్యము విశ్వశ్రేయః సాధనము. అదోషములు అలంకృతములు అయిన వాగర్థములు కావ్యము. రసాత్మకమైనదే (కావ్య) వాక్యము. కవులు ఏ విధంగానైనా రసాన్ని సాధించవలసి ఉన్నది.

సజ్జనులు రసప్రలుబ్ధ బుద్ధులు గనుక కవి తన కావ్యంలో రసాన్ని సాధించి తీరాలి. రసాత్మకములైన వాక్యాలతో కావ్యాన్ని నిర్మించాలి. అట్టి కావ్యంలోని వాక్కులు, అర్థములు, అదోషములు, అలంకృతములు అయి ఉండాలి. సిద్ధరసమైన కావ్యమే విశ్వశ్రేయస్సు సాధించగలదు. సర్వ వాఙ్మయానికీ విశ్వశ్రేయమే చరమ లక్ష్యము. వాఙ్మయంలో ఒక విశిష్ట శాఖయైన కావ్యానికి రసానందం ఒక విశిష్టలక్ష్యము. కవి తన కావ్యంలో రసాన్ని సాధిస్తే అది లోకంలో కల్యాణాన్ని సాధిస్తుంది. కవికి సాధ్యం రసం. కావ్యానికి సాధ్యం విశ్వశ్రేయస్సు. ఇది నన్నయ కావ్య దర్శనము.

"ఆయుష్యం బితిహాస వస్తు సముదా
యం బైహికాముష్మిక
శ్రేయః ప్రాప్తి నిమిత్త ముత్తమసభా
సేవ్యంబు లోకాగమ
న్యాయైకాంత గృహంబు నా బరగి
నానా వేద వేదాంత వి
ద్యా యుక్తంబగు దానిఁ జెప్పఁ దొడఁగెన్
దద్భారతాఖ్యానమున్"

ఆది. 3-11

ధర్మ తత్త్వజ్ఞులు ధర్మ శాస్త్రంబని
    యధ్యాత్మ విదులు వేదాంతమనియు
నీతి విచక్షణుల్ నీతి శాస్త్రంబని
    కవి వృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమని
    యైతిహాసికు లితిహాసమనియుఁ
బరమ పౌరాణికుల్ బహుపురాణ సముచ్చ
    యంబని మహిఁ గొనియాడుచుండ
వివిధ వేదతత్త్వ వేది వేదవ్యాసు
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరగుచుండఁ జేసె భారతంబు

ఆది. 1-31

మహాభారతము "మనః ప్రీతిదము", 'పండిత చేతో నిర్వృతి' చేయు నది. 'సర్వమనోజ్ఞము', హృదయరోచనము, "అతి హృద్యంబు', 'నవ్యార్థ రమణీయము' – ఇత్యాదిగా కొనియాడబడినది. పంచమ వేదమైన వ్యాస మహాభారతాన్ని నన్నయ దర్శించిన తీరు పై వాక్యాలలో స్థూలంగా గోచ రిస్తున్నది. ఈ భారతాన్ని ఆయన తెలుఁగులో రచించవలసి ఉన్నది.

"పాండవ ధార్తరాష్ట్ర విభేదన కథాశ్రవణ కుతుహల పరుండై యడిగిన జనమేజయునకు" వ్యాసానుమతుడై వైశంపాయనుడు "శ్రీమహాభారత కథా ఖ్యానం బాద్యంతంబు" సవిస్తరంబుగా జెప్పినాడు. "శ్రీ మహాభారత కథా శ్రవణ కుతూహలపరులైన" శౌనకాదులకు సూతుడు 'అమ్మును లడిగిన కథ యథా క్రమంబున సవిస్తరంబుగాఁ జెప్పం' దొడగినాడు. "శ్రీ మహాభార తంబునందలి యభిప్రాయంబు విన నభిలాష పెద్దయై" రాజరాజు "భారత కథా శ్రవణ ప్రవణ" మైన చిత్తముతో –

"జననుత కృష్ణద్వైపా
యన ముని వృషభాభిహిత మహాభారత బ
ద్ధ నిరూపితార్థ మేర్పడఁ
దెనుఁగున రచియింపు మధిక ధీయుక్తి మెయిన్"

అని నన్నయను కోరినాడు. నన్నయ వైశంపాయనుని వలె, సూతుని వలె కేవల కథకుడు కాడు. ఆయన "కవివరుడు". రాజరాజు కూడ కేవలము భారత కథా శ్రవణ కుతూహలికాడు. మహాభారతమందలి అభిప్రాయము విన నభిలషించినవాడు, కనుక నన్నయ భారతబద్ధమైన అర్థము తేటపడే లాగా భారత కథను చెప్పవలసి ఉంటుంది. రాజరాజు కోరిక విని నన్నయ ఇలా అన్నాడట – 'దేవా! నీ యనుమతంబున, విద్వజ్జనంబుల యను గ్రహంబునం జేసి నానేర్చు విధంబున నిక్కావ్యంబు రచించెద".

వ్యాసభారతాన్ని దాని పరమార్థం తేటపడేలాగా నన్నయ తెలుగులో వ్రాయాలని రాజరాజు మతం–ఇష్టం. నన్నయ ఆయన మతాన్ని అనుసరించి వ్రాయాలి. వ్యాస భారతాన్ని తాను గ్రహించిన తీరును అనుసరించి విద్వజ్జనులు కూడా గ్రహించాలి. ఆయన తాను నేర్చు విధంగా వ్యాస భారతాన్ని తెనుగున కావ్యంగా రచిస్తాడు. ఆయన నేర్చు విధం రాజరాజు కోరిన విధానికి అను కూలమైనదే.

"సారమతిం గవీంద్రులు ప్రసన్న
    కథా కవితార్థయుక్తి లో
నారసి మేలునా నితరు
    లక్షరరమ్యత నాదరింప నా
నారుచిరార్థ సూక్తినిధి
    నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారత సంహితారచన
    బంధురుఁడయ్యె జగద్ధితంబుగన్"

"అధికధీయుక్తి మెయిన్" తాను తెనుగున రచించ బోయే భారతకావ్యం తెనుగు వారందరిని ఆహ్లాదపరుస్తుందనీ, వారికి శ్రేయస్సు కలిగిస్తుందనీ నన్నయ ఆశయము. తన కావ్యంలో 'ప్రసన్న కథా కవితార్థయుక్తి' ఉంటుంది. ప్రయోజనాభిముఖంగా ప్రసన్నంగా, కథావర్ణనం సాగుతూ ఉండటంవల్ల భారతంలో నిబద్ధమైన అర్థం తేటతెల్లమవుతుంది. పైపైన చూచినవానికి కథనం రమణీయంగా ఉంటుంది. లోనారసినవానికి కథా పరమార్థం కూడా తెల్ల మవుతూ ఉంటుంది. కవీంద్రేతరులైన సామాన్యులకుకావలసిన అక్షరరమ్యత–

పద్యరచనాశ్రితమైన శబ్ద సౌందర్యం – తన కావ్యంలో పుష్కలంగా ఉం టుంది. పామరులైన శ్రోతలు దాన్ని ఆదరిస్తారు. నానావిధములైన రమ ణీయార్థాలను ప్రతిపాదించే ఉక్తులు తన కావ్యంలో కొల్లలుగా ఉంటవి. అర్థ చమత్కృతి అభిలషించే వారు వాటిని ఆస్వాదిస్తారు.

పుట్టబోయే తన కావ్యాన్ని గురించి నన్నయ విమర్శ ఇది. ఈ విమర్శ ఆయన రచనకు మాత్రమే అన్వయిస్తుంది. ఆయన రచనను ఎవరు విమర్శించ దలచుకున్నా ఈ సూత్రాలను అనుసరించవలసి ఉంటుంది. ఆ విమర్శ అంతా ఈ సూత్రాలను ఉదాహరణలతో వివరించటమే అవుతుంది. అలాంటి వివరణ మౌఖికంగా ఆయన రచన వెలువడిన నాటినుంచీ జరుగుతూనే ఉన్నదని ఊహించవచ్చును. నన్నయ తిక్కనలు 'తెనుంగు వారికిన్ వ్యాసముని ప్రణీత పరమార్థము తెల్లముచేసి' నారని నన్నయ తరువాత మూడువందల యేండ్లకు పుట్టిన ఎఱ్ఱాప్రెగ్గడ ఆంధ్ర భారత రచనా ప్రణాళికను చక్కగా విమర్శించి నాడు. ఆ పరమార్థాన్ని ఎలా తెల్లం చేశారో తరతరాల విద్వజ్జనులు నిరంత రంగా వివరిస్తూనే వచ్చినారు.

నన్నయనాటినుంచి క్రమంగా కవుల సంఖ్య, సహృదయుల సంఖ్య, విమర్శకుల సంఖ్య పెరుగుతూ వచ్చింది. సుకవులు, కుకవులు, కావ్యాన భిజ్ఞులు, వివేకులు, కుబుద్ధులు కావ్య సృష్టిలో, కావ్యాస్వాదనంలో, కావ్య విమర్శలో పాల్గొనసాగినారు. కావ్యావతారికలలో వీరందరి లక్షణాలు పుర స్కార తిరస్కారాలతో పేర్కొనబడినవి.

వెనసి గుణమైన దోషంబు సేయనేర్చుఁ
గుకవి కృతులందు, దోషంబు గుణముసేయ
నేరఁ, డదియట్లు; దొంతులు సేరి నాయి
దోర్చ నేర్చుగా కదియేమి సేర్పనేర్చు?

నెఱయ రసవంతమగు కృతి కెఱుగ నేర
రల్పరసకృతి కెఱుగుదు రల్పులెల్లఁ
జెఱకు పిడిచిన రసమున కెఱిగిరాక
పిప్పి కరిగెడు సీఁగల పెల్లవోలె.

తద్జ్ఞానం బెర్గనకుఁ గవితా విశేష
మజ్ఞానం దేమి యెఱుగంగనగు, సమస్త
కనక వర్ణోత్కరం బొరగంట నొరసి
చూచి కాకెర్గవచ్చునె సుద్దకాత?

అని నన్నెచోడుడు కుకవులను కుక్కలతోను, అల్పరసజ్ఞులను ఈగలతోను, అల్పకావ్యజ్ఞులను సుద్దముక్కతోను పోల్చి నిరసించినాడు. ఉత్తమ కావ్య లక్షణాలను గురించి, తన కావ్య లక్షణాలను గురించి నన్నెచోడుడు సుదీర్ఘంగా ఉపన్యసించినాడు.

నిర్వచనోత్తర రామాయణ పీఠికలో తిక్కన కూడ సుకవిస్తుతి, కుకవినింద చేసినాడు భూరి వివేక చిత్తులు 'పోలు' ననునట్లు చెప్పగల వాడే కృతి చేయవలెనని, 'కావ్యంబు సరసులైన కవుల చెవులకు నెక్కినగాని' పరిణతిగల కవీశ్వరుండు తృప్తిపడడని చెప్పినాడు. 'సుప్రసాద సంబోధన గోచర బహువిధార్థ తాత్పర్యముగా', 'లలితపదహృద్య పద్యంబులన కథా ర్థంబు ఘటిత పూర్వాపరమై యంతి యలతి తునియలఁ గాహల సంధించిన' విధంగా కావ్యం ఉండవలెనని తిక్కన అభిప్రాయము. తిక్కన భూరి వివేక చిత్తులు అన్నవారే సద్విమర్శకులని భావించవచ్చును. సద్విమర్శకులకు పరమవివేకము, సద్గుణసంపత్తి, సచ్చరిత్రము ఉండవలెనని నన్నయ అభిప్రాయము.

దుర్విమర్శకులను దుర్మతులని, ఖలులని, చెడుగులని పూర్వకవులు నిరసించినారు.

'భావరసానుకూల మృదుపాక పదార్థ సమృద్ధి లోక సం
భావన నొప్పు కావ్యముల మర్మము గానగ లేక దుర్మతుల్'

"భీమన పద్యమన్నఁ గడు ప్రీతి వహించుచు మేలుమేలునా
నేమిటి చెప్పినారమన నిక్కమె ప్రానము గూర్చినాడవో......

ఈ విధంగా కొఱవి గోపరాజు తననాటి విమర్శకులను తెగడినాడు. తప్పులు పట్టడమే వారి పని. కావ్యమర్మాలను గ్రహించలేరు. పూర్వకవి పద్యం అంటే గ్రుడ్డిగా మెచ్చుకుంటారు. సమకాలికుని రచన అంటే ఆక్షేపిస్తారు.

"ఖలుఁడిలఁ దప్పులే వెదకుఁ గావ్యరసానుభవంబు సేయలేడు" అని సంకుసాల నృసింహకవి కావ్యరసానభిజ్ఞులను ఖలులు అని తెగడినాడు.

"సరసతఁ దారునుం దెలియఁజాలరు, చెప్పిన నీసులేక యా
దరణ వహించి యూకొనరు, తప్పులెపట్టుదు, రొప్పుగన్న మె
చ్చరు, వెడయుక్తులెన్నుదురు, శక్తులుగా రొకఁడైన నింపుచే
కుర రచియింప, నట్టి చెడుగుల్ వినసేర్తురె సత్ప్రబంధముల్"

అని కంకంటి పాపరాజు దుర్విమర్శకుల లక్షణాలను సమగ్రంగా నిరూపించి వారిని చెడుగులు అని నిరసించినాడు.

అల్లసాని పెద్దన ఒక చాటుపద్యంలో "ఒప్పు తప్పరయు రసజ్ఞులు" దొరికితేనే తప్ప కావ్యంచెప్పటం వ్యర్థం అని అభిప్రాయపడినాడు. ఒప్పు తప్పరయు రసజ్ఞులే సద్విమర్శకులు. అలాంటివారు కవికి, లోకానికి పరమ బంధువులు.

మహాకవి లక్షణాలను, మహాకావ్య లక్షణాలను గూడా పూర్వకవులు తమ కావ్యావతారికలలో పేర్కొని ఉన్నారు. మహాకవి 'లోకజ్ఞుడు, ఉభయ భాషా కావ్య రచనాభిశోభితుడు, సత్ప్రతిభాభియోగ్యుడు, విపులశబ్ద శాసనుడు' అయి ఉండాలి అని నన్నయ, "అమలోదాత్త మనీషతో ఉభయకావ్య ప్రౌఢి పాటించు శిల్పమునం బారగుడు, కళావిదుడు' అయి ఉండాలనీ 'విద్వత్సంస్తవనీయ భవ్యకవితావేశుడు, విజ్ఞానసంసద్విఖ్యాతుడు, సంయమిప్రకర సంభావ్యానుభావుడు' అయి ఉండాలనీ తిక్కన. మహాకావ్యంలో ఉండవలసిన వస్తువు, నాయకుడు, రసము, రీతి, భాష, ఛందము. ఉక్తి. నీతి, ఔచిత్యము మొదలయిన అంశాలను గురించి కవులు తమ కావ్యావతారికలలో విస్తరించి వక్కాణించినారు.

మహాకావ్యం 'ఊర్జిత కథోపేతము, నానా రసోభ్యుదయోల్లాసి' అయి ఉండాలనీ; కథార్థంబు ఘటిత పూర్వాపరమై ఉండాలనీ, 'సుప్రసాద సంబోధన గోచర బహువిధార్థ తాత్పర్యముగా' ఉండాలని తిక్కన. 'తత్తదవయవవాక్య తాత్పర్య భేదములు మహాకావ్య తాత్పర్యమునకు నొనరఁ బలుక నేర్చుట బహుతపః ఫలము' అని సూరన మహాకావ్య తత్వాన్ని చక్కగా వివేకించినాడు.

మహాకావ్య లక్షణాలను వివరించే లక్షణ గ్రంథాలు సంస్కృతంలో పుష్కలంగా ఉన్నవి. వాటిని అనుసరించి కొన్ని లక్షణ గ్రంథాలు తెలుగులో కూడ వెలసినవి. ఈ తెలుగు లక్షణ గ్రంథాలు సంస్కృత గ్రంథాలకు అనువాదాలు కావు, స్వతంత్రాలు. తెలుగులో ప్రత్యేకంగా ఉన్న కొన్ని కావ్యభేదాలను ప్రక్రియలను కూడా ఈ గ్రంథాలు ప్రసంగిస్తున్నవి. విన్నకోట పెద్దన రచించిన కావ్యాలంకార చూడామణి, గౌరన రచించిన లక్షణదీపిక, అనంతామాత్యుని రసాభరణము, భట్టుమూర్తి నరసభూపాలీయము తెలుగులో స్వతంత్రంగా రచించబడిన సాహిత్య లక్షణ గ్రంథాలలో ముఖ్యంగా పేర్కొనదగినవి. అప్పకవి, చిత్రకవి పెద్దన రచించినవి ఛందశ్శాస్త్ర గ్రంథాలే అయినా వాటిలో కావ్యలక్షణాలు కూడా కొంతవరకు ప్రస్తావించబడినవి.

ప్రాచీన కావ్యాలలో ప్రౌఢములయిన వాటికి వ్యాఖ్యానాలు కూడా వెలసినవి. ముద్దరాజు పెద్ద రామన్న రాఘవ పాండవీయానికి, చిత్రకవి అనంతయ్య హరిశ్చంద్ర నలోపాఖ్యానికి వ్యాఖ్యానాలు వ్రాసినారు. ఇలాంటి వ్యాసంగం 16వ శతాబ్ది చివరి నుండి ఆరంభమయింది. అయితే యిది కావ్యాన్ని అర్థం చేసుకోవటానికి సహకరించే టీకలవంటివే కాని మొత్తం కావ్యాన్ని అనుశీలించే విమర్శలు కావు.

నన్నయ నాటినుంచీ కావ్యవిమర్శ బహుముఖాల ప్రవర్తిల్లుతూ ఉన్నప్పటికినీ అది అక్షరబద్ధమై మనకు లభ్యం కావటం లేదు. లేఖన సాధనాలు ఉన్నా సులభంగా ప్రతులను సిద్ధంచేసే సౌకర్యాలు లేకపోవటమే ఇందుకు కారణం కావచ్చును. ఒక మహాకావ్యం ఒక్క పర్యాయమే అవతరిస్తుంది. ఇది అక్షరబద్ధమై చిరకాలం నిలుస్తుంది. దాని మీద విమర్శ నిరంతరం పుడుతూనే ఉంటుంది. సభలలో, గురుకులాలలో ఎడతెగక ప్రవాహరూపంలో ప్రచారం అవుతూ ఉండే ఈ విమర్శను అక్షరబద్ధం చేయవలసిన అవసరం ఆనాటి వారికి కలిపించలేదని భావించవచ్చు. ఒక్కొక్క కావ్యాన్ని గురించి ఒక్కొక్క కాలంలో జరిగే వాదోపవాదాల సారాంశాన్ని మౌఖికంగా తరువాతి వారికి అందజేయటమే వివేకవంతమైన కార్యంగా పూర్వులు భావించి ఉండవచ్చును.

మహారాజుల సభాభవనాలలో, మంత్రుల మందిరాలలో, సంపన్నుల సదనాలలో, గురుకులాలలో, సాహిత్య గోష్ఠులు నిర్వహించబడుతూ ఉండేవి.

వాటిలో కావ్యగానాలు, కావ్య సమీక్షలు, కావ్య పరీక్షలు, కావ్య ప్రశంసలు, కృతి స్వీకారాలు జరుగుతూ ఉండేవి. ప్రాచీన కావ్యాలలో ఇలాంటి గోష్ఠుల ప్రసంగం చాలా తరచుగా కనబడుతుంది.

నన్నయను భారతాన్ని తెలుగులో రచింపుమని కోరిన సమయంలో రాజరాజు వైయాకరణులు, పౌరాణికులు, మహాకవులు, తార్కికులు మొదలైన విద్వజ్జనంబులు పరివేష్టించి కొలువ విద్యా విలాసగోష్ఠి సుఖోపవిష్టుడయి యిష్ట కథా వినోదంబుల" నుండెనట.

"ఒక్కనాడు విద్వద్గోష్ఠిగోష్ఠీ సమయంబునఁ గావ్యదర్పణ ప్రతిబింబిత మూర్తులైన మహా పురుషుల సద్వర్తనంబులు విని పరమానందంబు నొంది" తిక్కనసోమయాజి దశకుమారచరిత్ర రచించి తనకు అంకితంచేయమని కేతనను కోరినాడు.

త్రైలోక్య విజయాభిధంబైన సౌధంపు
చంద్రశాలా ప్రదేశంబునందు

శాస్త్ర మీమాంసయు సాహిత్య గోష్ఠియు
విద్వత్కవీంద్రులు విస్తరింప

కన్నుల పండువుగా నిండు కొలువుండిన వీరభద్రారెడ్డికి కాశీఖండము అంకితం చేయమని అల్లాడరెడ్డి శ్రీనాథుని ప్రార్థించినాడు.

"జనిత సాహిత్య సౌహిత్య సరసగోష్ఠిఁ
జిత్త మిగురొత్త నన్నయ సిద్ధమంత్రి"

కొలువుదీర్చి జక్కనను విక్రమార్క చరిత్ర రచింపుమని వేడినాడు.

"భువన విజయాఖ్యసంస
ద్భవన స్థితి భద్రపీఠిఁ బ్రాజ్ఞులగోష్ఠిన్
గవితా మధురిమ డెందము
దవులం గొలువుండి...

రాయలవారు మనుచరిత్ర రచించి తనకంకితమిమ్మని పెద్దనను అర్థించినారు.

"సకల భాషా ప్రగల్భ విద్వత్కవి రంజితంబును నగు సభాంతరం బున... పేరోలగంబుండి సాహిత్యగోష్ఠీ గరిష్ఠుండై" గొబ్బూరి నరసరాజు రామాభ్యుదయము రచించి యిమ్మని అయ్యలరాజు రామభద్రుని కోరినాడు.

''ఒడ్డోలగంబై కూర్చుండి కావ్య ప్రసంగ వశంబున "నంద్యాల కృష్ణ భూపతి కళాపూర్ణోదయము రచియించి యిమ్మని పింగళి సూరనను ప్రార్థించి నాడు.

ఇలాంటి సాహిత్య గోష్ఠుల ప్రశంసలు తెలుగు కావ్యాలలో కోకొల్ల లుగా ఉన్నవి. వాటిలో పాల్గొనే విద్వాంసులు, కవులు, నానా శాస్త్ర విశారదులు జరిపే సాహిత్య చర్చలు ఎంత నిశితంగా, సర్వతోముఖంగా ఉండేవో ఊహిం చటం ఏమీ కష్టంకాదు.

నన్నయనుండి వీరేశలింగం పంతులు వరకు జరిగిన కాలంలో గద్య పద్య చంపూ రూపాలలో పుట్టిన రచనలు ఇంచుమించుగా అన్నీ కావ్యాలే. చంపూ ద్విపద శతక యక్షగాన ప్రక్రియలలో పుట్టిన కావ్యసముదాయమే ఆ నాటి సాహిత్యము. కనుక నాడు సాహిత్య గోష్ఠిఅంటే కావ్యగోష్ఠియే. సాహిత్య విమర్శ అంటే కావ్య విమర్శయే

సాహిత్యం ఆవిర్భవించకముందే అంకురించి, సాహిత్యంతో పాటే అవతరించి సాహిత్యం వికసించినట్లల్లా వికసించి, విస్తరించినట్లల్లా విస్తరించిన సాహిత్య విమర్శ ఎనిమిదివందల యేండ్లపాటు మౌఖిక వ్యవహారంలోనే ఉండి క్రీ. శ. 19వ శతాబ్దిలోనే అక్షరబద్ధమై అవతరించింది. పాశ్చాత్య విద్య, ముద్రణ యంత్రాలు, వచన వాఙ్మయ వికాసము, పత్రికల స్థాపన, ప్రాచీన గ్రంథాల ప్రచురణ ఇందుకు కారణాలు; తెలుగులో విమర్శను అక్షర రూపాన అవతరింపజేసిన వారిలో ముఖ్యులు బ్రౌన్ దొర, వీరేశలింగము పంతులు.

3

తెలుగు దేశంలో ఆంగ్ల విద్యాభ్యాసం, ముద్రణా యంత్రాల స్థాపన క్రీ. శ. 1805 ప్రాంతాలలో జరిగినవి. 1835 ప్రాంతాన తొలి తెలుగు పత్రిక వెలువడినది. తెలుగు దేశంలో పెక్కు ప్రభుత్వాధికార పదవులు నిర్వహిం చిన చార్లెస్ ఫిలిప్ బ్రౌన్ దొర తెలుగు భాషా సాహిత్యాల విషయంలో

అపారమైన శ్రద్ధాసక్తులు వహించినాడు. పెక్కు తాళపత్రగ్రంథాలు సేకరించినాడు. పెక్కింటికి పండితులచేత లఘు టీకలు వ్రాయించినాడు. తాను తెలుగులో తగుమాత్రం పాండిత్యం సంపాదించి స్వయంగా కొన్ని గ్రంథాలకు టీకలు వ్రాసినాడు. ఛందో వ్యాకరణ గ్రంథాలను, ప్రబంధాలను పరిష్కరించి పీఠికలతో ప్రకటించినాడు. ఆ పరిష్కరణలలో, పీఠికలలో ఆయన విమర్శనాశక్తి ప్రస్ఫుటమౌతున్నది. సాహిత్య పరిశీలనలో పాశ్చాత్య దృక్పథాన్ని ప్రవేశపెట్టినవాడు బ్రౌన్‌దొర. ప్రబంధాలను గూర్చియేకాక వేమన పద్యాలను గూర్చి, జానపద సాహిత్యాన్ని గూర్చి బ్రౌన్‌దొర వ్రాసిన వ్యాసాలు సాహిత్య విమర్శకు చక్కని మార్గాలు వేసినవి.

శేషం వెంకటపతి వ్రాసిన తారాశశాంక విజయంలో అనవసరమైన పెంపువలను తగ్గిస్తే కావ్యం చిక్కబడి రసవత్తరం అవుతుందనీ, బాణాల శంభుదాసు వ్రాసిన సారంగధర చరిత్రకంటె దానికి మూలమైన నవనాథ చరిత్రలోని కథమే ఎక్కువ ఆహ్లాదకరంగా చెప్పబడినదని బ్రౌన్‌దొర వ్యక్తం చేసిన అభిప్రాయాలు ఆయన కావ్య విమర్శ శక్తిని చక్కగా పట్టియిస్తున్నవి.

1857 నుండి ఆంగ్ల భాషా సాహిత్యాల అధ్యయనము విశ్వవిద్యాలయాల స్థాయికి తేబడినది. ఆంధ్రదేశంలో పెక్కు కళాశాలలు నెలకొల్పబడినవి. ఆంగ్ల భాషా సాహిత్యాల అధ్యయనం విస్తరిల్లినది. విద్యావంతుల దృక్పథంలో మార్పు వచ్చినది. సాహిత్యాధ్యయనంలో, విమర్శలో పాశ్చాత్య దృక్పథం బలపడినది. సాహిత్య సమాజాలు, సభలు ఆరంభమైనవి. సాహిత్య పత్రికలు వెలసినవి. తెలుగులో ఈ నూతన దృక్పథంతో సాహిత్య విమర్శ ఆరంభించిన మనీషి వీరేశలింగం పంతులు ఆయన సాహిత్య వ్యాసంగం ప్రధానంగా ఆయన సంఘ సంస్కరణోద్యమానికి అంగమే అయినప్పటికీ సాహిత్యరంగలో ఆయన చేసిన కృషి, దాని ఫలితాలు ఎంతో విలువైనవి. క్రీ. శ. 1875-76లో ఆయన వివేకవర్ధని అనే పత్రికలో విగ్రహ తంత్ర విమర్శనము అనే రచన ప్రకటించినారు. ఒక గ్రంథాన్ని లక్ష్యంగా గ్రహించి విమర్శ సూత్రాలను అన్వయిస్తూ గుణదోష నిర్ణయంచేయటమే విమర్శ అయితే విగ్రహ తంత్ర విమర్శనమే తెలుగులో అచ్చయిన తొలి విమర్శ అని చెప్పవచ్చును.

పంతులుగారి సాహిత్య విమర్శనాదృష్టి వారి సరస్వతీ నారదవిలాపం అనే హేళన కావ్యంలో కూడా కనిపిస్తుంది. ఈ కావ్యంలో ఆయన క్షీణ యుగంలో ప్రబలిన చిత్ర, బంధ, గర్భ కవిత్వాలను తీవ్రంగా నిరసించి. కావ్యానికి ముఖ్యమైనది రసమే అని నిర్ణయించినారు. సాహిత్యవరుల దృష్టిని రసము దిక్కునకు ఆకర్షించి నాటి తెలుగు వారిలో ఉత్తమ సాహిత్యాభిరుచిని నెలకొల్పడానికి పంతులుగారు ప్రయత్నించినారు.

పంతులుగారు తాము రచించిన కవుల చరిత్రలో కూడా ఆయా కవుల కావ్యాలను గురించి తమ అభిప్రాయాలను ప్రకటించినారు. క్షీణయుగ ప్రబంధాలలోని అధమ శృంగారాన్ని నిరసించినారు. సాహిత్యానికి రసమెంత ముఖ్యమో హితబోధకూడా అంతే ముఖ్యమని ఆయన వెల్లడించినారు.

వివేక వర్ధని, హాస్యసంజీవని, చింతామణి మొదలైన వివిధ పత్రికలలో పంతులుగారు పెక్కు గ్రంథ సమీక్షలు ప్రకటించినారు. ప్రాచీన కావ్యాలు పెక్కింటికి పీఠికలు సమకూర్చినారు. అవినీతిని, అధర్మ ప్రవృత్తిని ప్రబోధిస్తూ కామాన్ని రెచ్చగొట్టే వర్ణనలతో నిండిన తారాశశాంక విజయంలాంటి ప్రబంధాలను ఆయన తీవ్రంగా నిరసించినారు. సంఘ సంస్కరణం ఆయన జీవిత లక్ష్యము. సాహిత్యం అందుకు సాధనంగా ఆయన ఉపయోగించినారు. ప్రాచీన గ్రంథాలను సమీక్షించేటప్పుడుకూడా ఈ దృష్టినే అవలంబించినారు. అందువల్ల సాహిత్యంలో నీతికి సత్ప్రవర్తనకి ఆయన చాలా ప్రాధాన్యం ఇచ్చినారు. అయితే ఇది సరిక్రొత్త దృక్పథం ఏమీ కాదు. "విశ్వశ్రేయః కావ్యమ్" అన్న నన్నయ అభిప్రాయాన్ని పునరుద్ఘాటించటం మాత్రమే.

కవిత్రయంవారి తరువాత క్రమంగా సాహిత్యంలో శృంగార లౌల్యం అతిశయించి, ఔచిత్యాన్ని అతిక్రమించి, అవినీతి ప్రచారంగా పరిణమించింది. క్షీణయుగంలో ముద్దుపళని వంటి స్త్రీలు 'రాధికా సాంత్వనం' లాంటి ప్రబంధాలు వ్రాయటం ఆరంభించినారు. ఈ ప్రవృత్తిని పంతులుగారు ఖండించటం అంటే శుచిమంతమైన కవిత్రయ సాంప్రదాయాన్ని పునరుద్ధరించటం అన్నమాటే.

ఈ కాలంలోనే వర్ధిల్లి విమర్శ సాహిత్యాన్ని సంపన్నం చేసిన విద్వద్విమర్శకులు శ్రీ వేదం వెంకట్రాయ శాస్త్రిగారు. పాశ్చాత్య సాహిత్యంతో శాస్త్రిగారికి గల ప్రగాఢ పరిచయం వారి ఆలంకారిక విమర్శన పద్ధతికి మెఱుగులు దిద్దినది. ప్రతిపద పరామర్శతోపాటు సమగ్రకావ్య సౌందర్య విమర్శన కూడా

చేయటం శాస్త్రిగారి పద్ధతి. "దేశక్షేమమునకు భాషాక్షేమము పునాది" అని వేదం వారి విశ్వాసము. అందువల్ల వారు విమర్శలో భాషా విషయాలకు కొంత ప్రాధాన్యం ఇవ్వటం సమంజసమే. ప్రాచీన కావ్యాలను పరిష్కరించి ప్రకటించ టం ఆరంభమైన ఆ కాలంలో ఆ పరిష్కరణలలోని లోపాలను ప్రత్యేకించి పరి శీలించటం అవసరము అని శాస్త్రిగారికి తోచి ఉండవచ్చును. 1895లో ఆనంద ముద్రణాలయంవారు ప్రకటించిన విక్రమార్కచరిత్రలో పెక్కు దోషా లున్నట్లు శాస్త్రిగారు చూపినారు. వెంకట సుబ్బయ్యగారు 1899లో ప్రకటిం చిన కాళహస్తిమాహాత్మ్యంలో కొన్ని ఛందో వ్యాకరణాది దోషాలను 'సూర్యా లోకము' అనే పత్రికలో నిరూపించినారు. భాషా జ్ఞానము, లక్షణ పరిజ్ఞానము సుమగా లేని అసమర్థులైన పరిశోధకులు ప్రాచీన కావ్యాలను పరిష్కరింప బూనుకొన్నందువల్ల భాషకు, కవులకు తీరని అపచారం జరుగుతుందని వేదం వారి అభిప్రాయము.

ఆముక్త మాల్యదకు, శృంగార నైషధానికి వేదంవారు రచించిన వ్యాఖ్యలు సర్వంకషములై వారి విమర్శనాశక్తికి సాక్ష్యములుగా ఉన్నవి. తాము రచించిన ప్రతాపరుద్రీయం ఎంత ప్రజాదరణ పొందినప్పటికీ ఆయా దరణ సరియైన విమర్శ దృష్టితో ఏర్పడినది కాదని ఆయన అభిప్రాయపడి నారు. "వస్త్వైక్యము, అంగాంగీ తారతమ్యము, కల్పనా చమత్కృతి, నిర్మాణ సౌభాగ్యము, పాత్రౌచిత్య పోషణము, ప్రధానరసము ఇత్యాదుల పరిశీలించి" ఆ నాటకం విలువను పరిగణించిన వారు ఎందరో లేరని వేదంవారు విచారపడి నారు. వారి సాహిత్య విమర్శనా దృష్టి యెంత నిశితమో, ఎంత సమగ్రమో ఈ మాటలే స్పష్టం చేస్తున్నవి.

వీరేశలింగం పంతులుగారి రాజశేఖర చరిత్ర తెలుగులో వెలువడిన తొలినవల. దానికి వివేకచంద్రిక అని నామాంతరం. ఆంగ్లభాషలో గోల్డ్‌స్మిత్ రచించిన 'ది వికార్ ఆఫ్ వేక్ ఫీల్డు" అనే నవలను అనుసరిస్తూ వీరేశలింగం గారు ఆనాటి తెలగువారి జీవితాన్ని చిత్రిస్తూ తెలుగులో రచించిన వచన గ్రంథం రాజశేఖరచరిత్ర. దీనిని కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రిగారు అగ్ని పరీక్షకు గురి చేసినారు. క్రీ. శ. 1895లో వివేక చంద్రికా విమర్శనము అనే పేరుతో వారు ప్రకటించిన గ్రంథంలో ఏడుభాగములున్నవి. కథామూలం, ఇతివృత్తం,

పాత్రములు, రసం, వర్ణనలు, అలంకారాలు, నీతులు, ఆచార వ్యవహారాలు మొదలయిన అంశాలు పరామర్శింప బడినవి. తొలి తెలుగు నవలపై వెలసిన యీ విమర్శ తెలుగు నవలా విమర్శకు శ్రీకారం చుట్టినదని చెప్పవచ్చును. రాజశేఖర చరిత్రము ప్రజాదరణపొంది రెండవ ముద్రాణాన్ని పొందటమే కాక ఆంగ్లభాషలోనికి పరివర్తనం కూడా అయినది. అట్టి స్థితిలో బ్రహ్మయ్య శాస్త్రిగారు దానిని తీవ్రంగా విమర్శించి నిరసించినారు. దానిలోని గుణాలను చూపే యత్నం బొత్తిగా చేయక సర్వ విషయములలోను దోషాలే ఎన్నినారు. నీతిబోధ చేయాలనే అత్యాసక్తివల్ల పంతులుగారు గ్రంథంలో సాహిత్య సౌంద ర్యాన్ని పూర్తిగా పాడుచేసినారని శాస్త్రిగారు విమర్శించినారు. రసప్రధాన కాదని నిరసించినప్పటికీ "మొత్తముమీద మన సంఘమందుగల దురాచారము లిందు చాల చూపబడినవి. ఇట్టి గ్రంథము లవశ్యము నుండవలెను" అని శాస్త్రి గారు అభిప్రాయ పడినారు.

వివేక చంద్రికా విమర్శన కేవలం ప్రతికూల దృష్టితో జరిగినా అది క్రొత్త మార్గాన్ని అనుసరించడంవల్ల నాటి విమర్శలలో దానికి మంచి స్థానం ఉన్నది. భాషా చ్ఛందో వ్యాకరణాంశాలను విమర్శించడం కంటే ఇతివృత్తం, రసం, పాత్ర పోషణ మొదలైన అంశాలమీదికి విమర్శకుల దృష్టిని మరలించ డం దీనిప్రత్యేకత. "కావ్యకాంతకు కథాంశము శరీరము, పాత్రలింద్రియములు, రసము ప్రాణము, ఇటి ముఖ్యాంశములే యిందు చెడినవి. ఇవి చెడకుండ తక్కి నవి చెడినను రమ్యత కంతగా లోపముండక పోవును." అని శాస్త్రిగారు వ్రాసినమాటలు ప్రాచీన కావ్యతత్వవేత్తల మాటలకు ప్రతిధ్వనులే అనవచ్చును. "రిఫారమును బోధించుటచే ఖండించుటలేదు. దేనిని బోధించినను రసభంగము కలుగ గూడదు." అన్న శాస్త్రిగారి వాక్యములు ఉత్తమ విమర్శలక్షణములను ప్రకటిస్తున్నవి.

తెలుగులో నవలా విమర్శకే కాక తులనాత్మక విమర్శకు కూడ వివేక చంద్రికా విమర్శనము మొదటిది అనవచ్చును. భారతీయ సాహిత్య లక్ష ణాలకు, పాశ్చాత్య సాహిత్య లక్షణాలను జతపరచి తెలుగులో అపూర్వమైన నవలా ప్రక్రియను పరిశీలించడం అప్పటికి క్రొత్త. తెలుగు నవలయైన రాజశేఖర చరిత్రమును దానికి మూలమైన ది వికార్ ఆఫ్ వేక్‌ఫీల్డుతో పోల్చి చూడటం కూడా నాటికి క్రొత్తయే.

కావ్యంలో వస్తువు, నేత, రసము, ముఖ్యములని భారతీయ కావ్యవేత్తల అభిప్రాయము. శాస్త్రిగారు ఆ మార్గాన్ని తమ విమర్శలో అవలంబించారు.

వేదంవారు కళాశాలలో విద్యార్థులకు కావ్యాలు చెప్పేటప్పుడు ప్రాచ్య పాశ్చాత్య పద్ధతులను జోడిస్తూ తులనాత్మకంగా విమర్శ సాగించేవారట. బ్రహ్మయ్య శాస్త్రిగారు వివేకచంద్రికా విమర్శలో ఆ పద్ధతిని అక్షరబద్ధంచేసినారు. విమర్శకు గురియైన గ్రంథం కథాప్రధానమైన నవల కావడంవల్ల శాస్త్రిగారి విమర్శ ఇతివృత్త నిర్వహణం మీద ఎక్కువ దృష్టిపెట్టి తెలుగు సాహిత్య విమర్శను ఒక క్రొత్త మలుపునకు త్రిప్పినదని చెప్పవచ్చును.

ప్రత్యేక ప్రబంధాల పరిశీలన కూడా యీ కాలంలో ఆరంభం అయినది. తెలుగు సాహిత్యంలో బహుజనాదరణం పొందిన ప్రబంధాలు మనుచరిత్ర, వసుచరిత. చెన్నపురి ప్రెసిడెన్సీ కళాశాలలోని ఆంధ్రభాషాభివర్ధనీ సమాజం వారు నిర్వహించిన పోటీలో పాల్గొంటూ వెన్నేటి రామచంద్రరావుగారు, 1899 లో మను వసు చరిత్ర రచనా విమర్శనము అనే గ్రంథాన్ని రచించినారు. రావు గారు పాశ్చాత్య సాహిత్యంతో, విమర్శతో బాగా పరిచయం కలవారు. ఆ పరిచయంతో వారు కావ్య లక్షణాలను, విమర్శ లక్షణాలను నిర్దేశిస్తూ మనుచరిత్రను, వసుచరిత్రను పోల్చి విమర్శించినారు. వసుచరిత్రకంటె మనుచరిత్ర ఉత్తమ ప్రబంధము అని నిరూపించినారు. అయినప్పటికీ మనుచరిత్రలోని లోపాలను, వసుచరిత్రలోని గుణాలను గూడ నిష్పక్షపాత దృష్టితో పేర్కొన్నారు.

రామచంద్రరావుగారి తీర్పును ఖండిస్తూ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు మనువసు ప్రకాశిక అనే విమర్శగ్రంథాన్ని 1902లో ప్రకటించినారు. కవుల దృక్పథాలు భిన్నంగా ఉన్నందువల్ల మనువసుచరిత్రలను తారతమ్య దృష్టితో పరిశీలించి తీర్పు చెప్పడం ఉచితంకాదని శాస్త్రిగారు అభిప్రాయ పడినారు. గ్రంథరచనలో కవి ఆశయాన్ని దృష్టిలో పెట్టుకోవలసిన అవసరము విమర్శకునకు ఉన్నది అని శాస్త్రిగారు చేసిన సూచన విమర్శకులకు కొంత కనువిప్పు కాగలదు.

ప్రత్యేక ప్రబంధాల మీదలాగే ప్రత్యేక కవుల మీదకూడ ఈ కాలంలో విమర్శలు బయలుదేరినవి. 1895లో మద్రాసు క్రైస్తవ కళాశాలలోని ఆంధ్ర భాషాభిరంజనీ సమాజం నిర్వహించిన సభలో పి. దక్షిణామూర్తిగారు పింగళి సూరన సాహిత్యాన్ని సమీక్షించినారు. కవిత్రయం వారి కవితాశక్తి, భావనా పటిమ ప్రబంధకవులలోలోపించినదనీ, శబ్దాడంబరం, అలంకారప్రీతి హెచ్చిన దక్షిణామూర్తిగారి అభిప్రాయము. ప్రబంధ కవులలోని పెక్కు దోషాలను

పేర్కొని అట్టివి సూరన్నలో లేవని ఆయన అన్నారు. సూరన్న గొప్ప భావనా శక్తి కలవాడనీ, అతని వర్ణనలు, శైలి సహజసుందరంగా ఉండుననీ, ఆయన తిక్కన నాచన సోమనాథులతో తులదూగ గలవాడనీ దక్షిణామూర్తిగారు నిశ్చయించినారు.

1914లో ప్రెసిడెన్సీ కళాశాలలోని ఆంధ్ర భాషాభివర్ధనీ సమాజంవారు నిర్వహించిన సభలో వింజమూరి రంగచార్యులుగారు పింగళి సూరనను గూర్చి ఒక ఉపన్యాసం చదివినారు. ప్రాచీనాంధ్ర కవులు త్రొక్కిన మార్గాలను సమీక్షించి, తెలుగులో స్వతంత్ర పథాలను అన్వేషించిన కవులు తక్కువ అనీ, కాలానుగుణంకాని అంధానుకరణం ఎక్కువనీ, విశేషించి రాయల యుగం తరువాత తెలుగు కవితకు క్షీణదశ పట్టినదనీ, శబ్దాలంకారాలు, దీర్ఘ వర్ణనలు, చిత్ర బంధ కవితలు, శ్లేషలు మితిమీరినవని రంగాచార్యులుగారు అభి ప్రాయపడినారు. ప్రబంధ కవులలో కొంత స్వాతంత్ర్యాభిలాష కలవారు పింగళి సూరన, తెనాలి రామకృష్ణుడు అని పేర్కొన్నారు. సూరన కావ్యరచనా పరిణా మాన్ని సమీక్షించినారు, కళా పూర్ణోదయ రచన నాటికి సూరన దృష్టి కథా చమత్కృతి మీదికి రసపోషణమీదికి మరలినది అన్నారు. కళాపూర్ణోదయంలో కథాచమత్కారం కోసం పెక్కు అస్వాభావిక సంఘటనలను కూర్చి కథను క్లిష్టం చేసినాడని నుడివినారు. కళాపూర్ణోదయం నాటికంటే ప్రభావతీ ప్రద్యు మ్నము నాటికి సూరన కవితాశక్తి పరిపక్వమైనదనీ, ఔచిత్యవంతమైన ఇతి వృత్తము, సహజమైన పాత్రపోషణ, నాటకీయ రచనా శిల్పము ప్రభావతీ ప్రద్రుమ్నమును ఉత్తమ కావ్యముగా తీర్చినవనీ రంగచార్యులుగారి అభి ప్రాయం. కథకంటే కథానిర్వహణం ముఖ్యమని గ్రహించి, సూరన ప్రాచీన వృత్తాంతాన్నే స్వీకరించి చక్కని ఐక్యంతో కథ నిర్వహించినాడనీ సూరన కావ్యాలలో ప్రభావతీ ప్రద్యుమ్నమే ఉత్తమమైనదనీ ఆచార్యులుగారు తీర్మానించినారు. సహజము రసోచితం అయిన శైలికి ఉచిత వర్ణనలకు, అద్భుత భావనాశక్తికి మానవ మనస్తత్వ పరిజ్ఞానానికి, అక్లిష్ట భావ వ్యక్తీకర ణానికి తెలుగు సాహిత్యంలో తిక్కన తరువాత పేర్కొన దగినవాడు సూర నయే అని ఆచార్యులవారు నిశ్చయించినారు. వీరేశలింగంగారితో ఆరంభమైన సాహిత్య విమర్శ రంగాచార్యులుగారి రచనలో చక్కని పరిణత స్థితిని పొం దినదని చెప్పవచ్చును.

ఈ కాలంలో భారతము మొదలయిన గ్రంథాలమీద కూడా కొంత విమర్శ సాగినది. గ్రంథాల రూపంలో, పత్రికా వ్యాసాలరూపంలో ఆ విమర్శ ప్రకటింపబడింది. ఆ చర్చలలో సాహిత్యేతర విషయాలు ఎక్కువ చోటు చేసికొన్నవి. 1910లో ప్రెసిడెన్సీ కళాశాలలోని ఆంధ్రభాషాభివర్ధనీ సమాజం వారు నిర్వహించిన నన్నయ వర్ధంతిలో పుదుప్పాకం సుబ్రహ్మణ్య అయ్యర్ చదివిన 'నన్నయ భట్టారకుడు' అన్న వ్యాసంలో మాత్రం నన్నయ అనువాద విధానము, సందర్భానుగుణమైన రచన, రసభావానుగుణమైన శైలి, నాగరికములైన శృంగార వర్ణనలు, పాత్రల చిత్తవృత్తి చిత్రణ మొదలైన అంశాలు చర్చించబడినవి.

విక్రమోర్వశీయము, శాకుంతలము మొదలయిన సంస్కృత నాటకాల ఆంధ్రీకరణలమీద కూడ విమర్శలు వెలువడినవి. తిరుపతి వెంకటేశ్వర కవులకు ఇతర కవులతో ఆ కాలంలో జరిగిన వాగ్యుద్ధాలు కూడా ఒక విధమైన విమర్శయే, కాని వారిలో శాబ్దిక చర్చలు, పరస్పర దూషణలు ఎక్కువ.

ఆనాడు గ్రంథప్రచురణ సంస్థలుకూడ విమర్శనను ప్రోత్సహించనారంభించినవి. పాత్ర పోషణం, రసపోషణం, ఔచిత్యం, కల్పనా చాతుర్యం, కథా నిర్వహణం, గుణాలు మొదలైన విషయాలను దృష్టిలో పెట్టుకుని విమర్శలు వ్రాయవలెనని ఆంధ్రప్రచారిణీ గ్రంథమాల వారు చేసిన ప్రకటనవల్ల ఆనాటికి సాహిత్య విమర్శ దృష్టిలో పెట్టుకుని విమర్శలు వ్రాయవలెనని ఆంధ్ర ప్రచారిణీ గ్రంధమాల వారు చేసిన ప్రకటనవల్ల ఆ నాటికి సాహిత్య విమర్శ దృష్టి ఎలాంటి పరిణామం పొందినదో స్పష్టపడుతుంది.

సాహిత్యం విస్తరించినకొల్ల సాహిత్య విమర్శకూడ విస్తరించినది. కావ్యాలు, నాటకాలు, నవలలు విమర్శకు గురి ఆయినవి, శబ్దంతో ప్రారంభమైన విమర్శ సర్వ కావ్యాంగాలను పరామర్శిస్తూ సమగ్ర కావ్య స్వరూప దర్శనంగా పరిణమించింది. నన్నయ పేర్కొన్న''లో నారయుట'' కూడ ఆరంభమైనది.

ఈ కాలంలో సాహిత్య విమర్శ వికాసానికి, ప్రచారానికి పత్రికలు, కళాశాలలోని సాహిత్య సంఘాలు, కవి పండిత సమాజాలు ఎంతో తోడ్పడినవి.

పత్రికలలో పేర్కొనదగినవి – సుజనరంజని (1864), ఆంధ్ర భాషా సంజీవిని (1871), పురుషార్థ ప్రదాయిని (1872), వివేకవరని (1874). ప్రబంధ కల్పవల్లి (1880), అముద్రిత గ్రంథ చింతామణి (1885), రాజ యోగి (1889), చింతామణి (1892), శశిరేఖ (1894), వైజయంతి (1894), మంజువాణి(1895), సరస్వతి(1893), కళావతి (1889), వాగ్వల్లి (1899), కృష్ణాపత్రిక (1902), అభినవ సరస్వతి (1909), మానవసేవ (1911), ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక (1911).

కళాశాలలలోని సాహిత్య సంఘాలలో ముఖ్యమైనవి చెన్నపురి ప్రెసిడెన్సీ కళాశాల ఆంధ్రభాషా రంజనీ సమాజము, క్రైస్తవ కళాశాల ఆంధ్ర భాషా రంజనీ సమాజము.

1565లో బందరులో స్థాపించబడిన 'దైవ సమాజిని', 1897లో బళ్ళారిలో వెలసిన 'కవిపండిత సంఘము', 1900 లో గుంటూరులో ఆరంభ మైన 'యువ సాహితీ సమితి' మొదలైన సాహిత్య సమాజాలు విమర్శ వికా సానికి, విమర్శ పోటీల నిర్వాహణకి తోడ్పడినవి.

४

వీరేశలింగం పంతులుగారి 'విగ్రహ తంత్ర విమర్శ"తో ఆరంభమై వింజమూరి రంగాచార్యులుగారి "పింగళి సూరనార్యుడు" వరకు క్రమముగా, వికాసాన్ని పొందిన విమర్శ లక్షణాలను క్రోడీకరించి ఒక అభినవ కవిత్వ తత్వ విచారధారగా ప్రదర్శించిన రసికులు కట్టమంచి రామలింగారెడ్డిగారు. 1899లో వీరు కళాపూర్ణోదయంమీద వ్రాసిన వ్యాసం 1914 నాటికి పెరిగి కవిత్వతత్వ విచారంగా వెలువడింది. సాహిత్య విమర్శలో అయన ఒక నూతన ప్రస్థానాన్ని నెలకొల్పినారనీ, అయన కవిత్వతత్వ విచారము ఒక సాహిత్య విమర్శోపనిషత్తనీ, ఆయన కావ్యాత్మను దర్శించిన ద్రష్ట అనీ పలువురు పలు విధాల రెడ్డిగారిని స్తుతించినారు. వేరొక వంక ఆయన చెప్పిన విషయాలలో క్రొత్తవి ఏవీలేవనీ, చాలావరకు అంతకు పూర్వం వీరేశలింగం, వింజమూరి రంగాచార్యులు, వెన్నేటి రామచంద్రరావు ప్రభృతులు చెప్పినవే అని పలువురు అభిప్రాయపడినారు.

రామలింగా రెడ్డిగారు ఆంధ్ర సాహిత్యం బాగా చదువుకున్నారు. కవి త్రయం మీదా, వేమన్న మీదా ఆయనకు అపారమైన గౌరవం ఉన్నది. పాశ్చాత్య

సాహిత్యాన్ని కూడా ఆయన క్షుణ్ణంగా చదువుకున్నారు. ఇంగ్లాండులో ఉండి ఉన్నతవిద్య అభ్యసించినారు. పాశ్చాత్యుల సంస్కృతి, సాహిత్యం ఆయనకు బాగా నచ్చినవి. అందువల్ల భారతీయ సంప్రదాయాల మీదా, సంస్కృతి మీద ఆయనకు చిన్నచూపు ఏర్పడినది. ఆయన తెలుగు సాహిత్య విమర్శలో అవ లంబించిన దృక్పథంలో ఈ లక్షణాలు కనబడతవి. పారతంత్ర్యంవల్ల జాతి నిర్వీర్యమైపోయినదనీ అందువల్ల తెలుగు సాహిత్యంలో స్వతంత్ర కావ్య స్పృజనశక్తి నశించినదనీ రెడ్డిగారి అభిప్రాయం. రాయలయుగం తరువాత వచ్చిన గ్రంథాలన్నీ ఒకదానికొకటి నకళ్ళుగా ఉన్నవనీ, అలంకారశాస్త్ర దాస్యం ఎక్కువైనదనీ, వాటిల్లో కథకంటే వర్ణనలు మితిమీరి పోయినవనీ, అసభ్య శృంగారం తప్ప ఇతర రసములు లేనందువల్లను, శ్లేష యమక దీర్ఘ సమాసాలవల్లను ప్రబంధాలన్నీ శుష్క పాండిత్య ప్రదర్శకము లయినవనీ రెడ్డి గారి అభిప్రాయము.

పురాణాలలో కథలను తీసికొని, అలంకారశాస్త్రాలు విధించిన అష్టాదశ వర్ణనలను బలవంతంగా చొప్పించినందువల్ల తెలుగు ప్రబంధాలు శవ ప్రాయంగా ఉన్నవని రెడ్డిగారు నిరసించినారు. అయితే ఇవన్నీ ఆయనకు పూర్వం విమర్శకులు అన్నమాటలే. కవికి స్వతంత్రభావనాశక్తి ఉండాలనీ, అపూర్వ కథా కల్పన. ఐక్యము కావ్యానికి ముఖ్యమని రెడ్డిగారు నొక్కి చెప్పి నారు. అలంకారాలు, వర్ణనలు, రీతి మొదలైనవి కావ్య సౌందర్యానికి దీప్తి కలిగించేవిగా మాత్రమే ఉండాలి అన్నారు. కావ్యంలోని ఐక్యం అంటే ఏమిటో ఆయన ఇలా అన్నారు—

"కథాంగములు ఏకభావముం దాల్చి యొక శరీరముగా నేర్పడియున్న కళకు ప్రాశస్త్యము" "ఉన్న భాగములను దీసివేయ వచ్చునా? క్రొత్తవి ఏవైన చేర్చవచ్చునా ? అని విమర్శించుట ఐక్యమను లక్షణమును పరీక్షించు పద్ధతి" "వర్ణనముల కన్న కావ్యమునందలి అంగాంగములకు గల కలయిక ముఖ్యము." "రసభంగమా కాదా యనుటయే శిల్ప విమర్శనము యొక్క పరీక్ష."

పై వాక్యములలో రెడ్డిగారు వస్త్వైక్యము ప్రధానంగా చెప్పినారు. ఈ మాట ఆనందవర్ధనాదులైన ప్రాచీన సాహిత్య దార్శనికులు చెప్పినదే. రెడ్డి

గారు తననాటి విమర్శకులకు ఈ విషయము గుర్తుచేసినారు. కాని కథాకల్పనయే కావ్య సర్వస్వమని పూర్వులెవ్వరును భావించలేదు. అపూర్వమైన కథను కల్పించి అందలి వివిధ సన్నివేశాలను కాలక్రమ బద్ధములుగాకాక కార్యకారణ బద్ధములుగా నిబంధించినందువల్ల పాఠకునకు కథాపర్యవసానమేమగునో తెలిసికొనవలెనన్న ఉత్కంఠయే బలిష్ఠంగా ఉంటుందిగాని రసంమీద దృష్టినిలువదు. రసపోషణకు కథ నిమిత్త మాత్రం అని ప్రాచీన భారతీయ కావ్యవేత్తల అభిప్రాయము. కథా నిర్మాణానికి, పాత్ర పోషణకు పాశ్చాత్యులిచ్చినంత ప్రాధాన్యం మనవారు ఇయ్యలేదు. కథ లేకపోవటం కావ్యత్వానికి భంగం అయితే కాళిదాసు మేఘసందేశం కావ్యమేకాదు. కథలో ఐక్యం లేకపోతే కావ్యరసానికి భంగం కలిగితే రఘువంశంలో రసభంగం అయినట్లే పెద్ద కథను సృష్టించినాడా లేదా అన్నదానికంటే ఉన్నకథను రసాభివ్యంజకంగా తీర్చినాడా లేదా అన్నది ముఖ్యం.

ఇతివృత్తము కావ్యానికి శరీరమని పూర్వుల అభిప్రాయం. ఆ శరీరాన్ని విచిత్రంగా నిర్మించినంత మాత్రాన కవి కృతార్థుడు కాగలడా? శరీర నిర్మాణంలో ఐక్యం సాధించడం అన్నదే కవిత్వం అవుతుందా? పాశ్చాత్యుల దృష్టితో అవుతుంది. పాశ్చాత్యుల అభిప్రాయంలో ఇతివృత్తమే కావ్యానికి ఆత్మ. భారతీయుల అభిప్రాయంలో అది రసాభివ్యక్తికి ఒక సాధనంమాత్రమే. కళాపూర్ణోదయంలోని అపూర్వకథా కల్పనను మిక్కిలి మెచ్చుకుంటూనే రెడ్డిగారు ఆ కల్పనలోని పెక్కులోపాలను ఎత్తిచూపినారు. మధురలాలసా వృత్తాంతము లేకున్నా మేలుగా ఉండేది అన్నారు. గ్రంథం చివరికి వచ్చేసరికి సూరన్నకు వార్ధక్య లక్షణాలు గోచరించి, భావనాశక్తి క్షీణించి, వర్ణనలు, శృంగారము తుచ్ఛప్రబంధ ధోరణిలోనికి దిగిపోయినవి అన్నారు.

కళాపూర్ణోదయంలోని శైలి రసోచితంగా ఉన్నదని, సంభాషణలు నాటకీయంగా నిర్వహించ బడినవని రెడ్డిగారు మెచ్చినారు. కాని చివరిభాగంలో సూరన వాడిన శ్లేషలను, యమకాలను, చిత్రకవితలను రెడ్డిగారు నిరసించినారు.

కళాపూర్ణోదయంలో నానావిధమనః ప్రవృత్తులుగల పాత్రలనుసృష్టించిన సూరన నైపుణిని రెడ్డిగారు ప్రశంసించినారు. విశేషించి కలభాషిణి పాత్రను ఆయన అభిమానించినారు. "ఈ కథయందలి పాత్రములలో నాకు ప్రియ

తమ కలభాషిణి. నిక్కచమైన శృంగార భావములకు ప్రకాశకురాలు. శాస్త్ర కారుం శృంగారమను దయ్యేమంతగా సోకనిది. జన్మమున వారకాంత. గుణ ముం ప్రబంధనాయికలగు కులస్త్రీల కంటె మేలయినది. ఏకకాలంబున నిరు వురి యొక మనసు దగిలిన దానినిగా వర్ణించుట కాధారముగాఁ గవి యామెను గణికగాఁజేసినఁ దప్పుదేవని యిట్టిపుట్టుక నారోపించినాడోః పరిశీలింపుడు. ఎట్లును నీచె నీచ పాత్రముగాదు. మరి మహోదారచరిత్ర. సర్వజన స్తవనీయ. మణికంధరుని సాహిత్యపటిమకు, గుణసంపదలకు మెచ్చి వానియెడ బద్ధాను రాగయై యుండియు, జాతిదోషముచేతఁగాబోలు నలకూబరుని రూపలావణ్యాది సౌభాగ్యంబులకు మెచ్చి, తదాలోకనంబు నం దనియక, వాని విమానంబుతోఁ గొంత దవ్వరిగి, యంతమగిడి, యాతని తెఱంగెఱుంగంగోరి..." ఈ వాక్య ములు రెడ్డిగారి ఆభిరుచిని పట్టియిస్తున్నవి.

కథా కల్పనంలో కూడా రంభానలకూబరుల వృత్తాంతం రెడ్డిగారికి బాగా నచ్చినది. అది ఎంతో అపురూపమైన కథాసందర్భమనీ, షేక్స్పియర్ రచించిన కామెడీ ఆఫ్ ఎరర్సు నాటకంలోని సందర్భాన్ని పోలి ఉన్నదని రెడ్డిగారు మెచ్చినారు. సూరన్నకు పూర్వమే మనదేశంలోనే శక్తిభద్రుడు ఆశ్చర్య చూడామణిలో ఇలాంటి సన్నివేశం కల్పించినాడు. సూరన్నకు అది అజ్ఞాతమై ఉండదు. జన్మాంతర ప్రణయాల కల్పనకూడా సూరన కాదంబరి నుంచి గ్రహించి ఉంటాడు కథాసరిత్సాగరంలో చిత్రవిచిత్ర ప్రవృత్తుల వ్యక్తు లున్నారు. సూరన్న వానిని ఎఱుగనివాడు కాడు. తన కావ్యాన్ని అత్యపూర్వ కథా సంవిధాన మహనీయం చేయాలని ఉద్దేశించి సూరన ప్రాచీన కావ్యాలలోని వింతలను సంగ్రహించి తన కావ్యంలో సంధానించినాడు.

సూరన్న చిత్రించిన శృంగార విలక్షణతను రెడ్డిగారు విశ్లేషించి చూపి నారు. సుగాత్రీ శాలీనుల కథయందలి మానసిక శృంగారము శ్రేష్ఠమయినది. సరస్వతీ చతుర్ముఖుల విలాసఘట్టము వంటిది తెలుగు సాహిత్యంలో మఱి యెక్కడను లేదు. కల్యాసురుని ప్రేమ అమాయికము, నిష్కళంకము. ఈ విధంగా స్వతంత్రములు నవీనములు అయిన కల్పనలకు నెలవైన కళాపూర్ణో దయము సూరన గ్రంథాలలో తలమానికము లాంటిదని రెడ్డిగారు నిర్ణయించి నారు; ప్రభావతీ ప్రద్యుమ్నంలో ఇలాంటి కల్పనలు లేనందున దానిని రెడ్డి

గారు మామూలు ప్రబంధాల కోవలో చేర్చినారు. రెడ్డిగారి ఈ అభిప్రాయంతో పలువురు ఏకీభవించరు. సూరన్నయే యేకీభవించడేమో !

కవిత్వతత్త్వ విచారంలో సాహిత్యానికి సంబంధించని అనేక విషయాలు కూడా ఉన్నవి. భారతీయుల ఆచార వ్యవహారాల నిరసనం, అలంకార శాస్త్రాల దూషణ తెలుగు కవుల అంగప్రత్యంగ వర్ణనల తిరస్కరణ స్వేచ్ఛగా చేయ బడినవి. హిందువుల ధర్మాలు, నీతులు, వేదాంతాలు నిందించబడినవి. పాశ్చాత్య సంస్కృతీ సాహిత్యాలు అభినివేశంతో కొనియాడబడినవి. మొత్తంమీద కవిత్వ తత్త్వ విచారంలో రెడ్డిగారు అవలంభించిన దృష్టి పూర్తిగా విజాతీయము. అందువల్ల ఆయన గ్రంథం పలువురి విమర్శకు గురి అయినది. కురుగంటి సీతారామయ్యగారు, డాక్టర్. జి వి. కృష్ణరావుగారు రెడ్డిగారి అభిప్రాయాలను ఖండించినారు. పూర్తిగా పాశ్చాత్యమైన దృక్పథంతో ఆంధ్ర సాహిత్యాన్ని పరిశీలించడం ఉచితం కాదన్న అభిప్రాయం పలువురు వెలిబుచ్చినారు,

ఇంతకును కళాపూర్ణోదయ కావ్యం యొక్క తత్త్వం రెడ్డిగారికి పూర్తిగా తెలిసిందా? డా॥ జి. వి. కృష్ణారావుగారు, డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారు చేసిన పరిశీలనలను బట్టి చూస్తే పైపై చమత్కారాలే తప్ప అసలు గ్రంథం యొక్క అంతస్తత్వం రెడ్డిగారికి తెలియలేదనిపిస్తుంది. అయినప్పటికీ సాహిత్య విమర్శలో రెడ్డిగారు త్రొక్కిన మార్గము స్వతంత్రమైనది కొంత సంయ మనము, సమన్వయదృష్టి ఉంటే సాహిత్య సౌందర్య సమాలోచనకు వారు చూపిన మార్గము సమీచీనము కాగలదు.

కవిత్వతత్త్వ విచారంలోనేకాక తొలకరి, కృషీవలుడు, శాలివాహన గాథాసప్తశతీసారము మొదలైన ఆధునిక రచనలకు రెడ్డిగారు వ్రాసిన పీఠిక లలో కూడా వారి విమర్శనాపాటవం ప్రస్ఫుటమవుతుంది

కవిత్వతత్వాన్ని యథార్థంగా దర్శించినవారు విశ్వనాథ సత్యనారాయణ గారు. తెలుగు సాహిత్యంలో ఆయన చేపట్టి సాధించని ప్రక్రియ లేదు. సంస్కృత-ఆంధ్ర-ఆంగ్ల సాహిత్యాలను ఆయన ఆపోశన పట్టినారు. పెక్కు శాస్త్రాలను క్షుణ్ణంగా చదువుకున్నారు. లోకాన్ని సునిశిత దృష్టితో చూచినారు. కావ్యాలను, నవలలను, నాటకాలను, కథలను, నాటికలను, వ్యాసాలను ఎన్నో వ్రాశారు. అన్నింటిలోనూ సిద్ధహస్తులు అనిపించుకున్నారు.

సంస్కృతంలోని సాహిత్య శాస్త్ర గ్రంథాలను గాఢంగా అధ్యయనం చేశారు. భారతీయ సాహిత్య దర్శనాన్ని పాశ్చాత్యుల సాహిత్య దృష్టితో సమన్వయం చేసుకున్నారు. సంగీతం, చిత్రలేఖనం, శిల్పం, నాట్యంలాంటి కళల తత్వాన్ని చక్కగా ఆకళింపు చేసుకున్నారు. ఇన్ని విషయాలను గురించిన సమగ్ర పరిజ్ఞానంగల సత్యనారాయణగారు సాహిత్యాన్ని విమర్శించడానికి సరియైన అధికారి. అంతంత మాత్రపు సాహిత్య పరిజ్ఞానంతో సాహిత్యాన్ని విమర్శించడానికి పూనుకున్నవారి విమర్శలు అసమగ్రంగా, ఉపరితల స్పర్శ మాత్రంగా ఉండక తప్పదు.

"The judgement of literature is the long-delayed reward of much endeavour." అని Longinus చెప్పినమాట పరమార్థము. విశ్వనాథవారు సాహిత్య సృష్టిలో, సాహిత్యాధ్యయనంలో చేసిన కృషిఫలమే ఆయన సాహిత్య విమర్శ. మార్గాలలో ఆయనమార్గం సర్వోత్కృష్టమైనది.

విశ్వనాథవారికి ప్రాచీనతపై ఎంత భక్తియో నవీనతపై అంత అనురక్తి. సంప్రదాయం అంటే ఎంత అభిమానమో ప్రయోగం అంటే ఎంత అభిమానమో ప్రయోగం అంటే అంత అభిలాష. సాహిత్య విషయంలో ఆయనది దేశకాలావధులను దాటిన విశాల దృష్టి. సాహిత్య సమీక్ష విషయంలో ఆయన అభిప్రాయాలు గమనింపదగినవి :-

"శిల్పము కథాగతమై యుండును. కథను రచించుటలో కథయొక్క పౌర్వాపర్యములు విచారించి, కథయొక్క ఆయువుపట్టులు తెలునుకొని అది సువ్యక్తమగుటకు కొన్ని మెలకువలుపయోగించుట శిల్పమని చెప్పవచ్చును".

"కావ్యము వెదకి చూచిన ప్రత్యక్షరము, ప్రతిశబ్దము, ప్రతివాక్యము, ప్రతి అలంకారము కావ్యరసోన్ముఖముగా పరుగెత్తుటకన్న మించిన మహాశిల్పము లేదు."

"ఒక కావ్యమునందు పరమమైన విషయము ఏకవాక్యత"

"మహాకవియగుటకు రసభావముల తీర్పు, కథా నిర్మాణ శక్తి, కథా రచనాశక్తి, లోకోత్తర స్థితియందుండవలెను.

"ఒక దృష్టితో చూచిన ఒక కవి యాధిక్యము తెలియును ... ఒక కవియొక్క కవితను చదువుటకు సానుభూతి కావలయును. రెండవది బహు విషయములను సంయోజన పరచు కొనవలయును. తాను వలచినదియే రంభ, తాను మునిగినదియే గంగ కాగూడదు".

విశ్వనాథవారి విమర్శన పద్ధతిలో శాస్త్రమున కెంత స్థానమున్నదో, అనుభూతికి అంత స్థానమున్నది. కనుకనే ఆయన విమర్శలు సహృదయతా సహకృతములై కవి హృదయాన్ని ఆవిష్కరిస్తూ స్వయంగా సాహిత్య పద విని అందుకొంటున్నవి. మహాకవియే మహాకావ్యాన్ని విమర్శించడానికి అధి కారి అని ఆయన విమర్శలు నిరూపిస్తున్నవి.

ఉపన్యాసాలలో, వ్యాసాలలో, గ్రంథాలలో, పీఠికలలో విశ్వనాథవారి విమర్శ బహుముఖంగా వ్యాప్తి చెందినది. గ్రంథ రూపంలో వెలువడిన విమర్శ లలో నాలుగు ప్రధానంగా ఉన్నవి – నన్నయగారి ప్రసన్న కథా కలితార్థ యుక్తి, అల్లసాని వాని అల్లిక జిగిబిగి, ఒకడు నాచన సోమన్న, శాకుంతలము యొక్క అభిజ్ఞానత.

ప్రసన్నకథా కలితార్థయుక్తి తన కావ్యంలోని ప్రధాన లక్షణమని నన్నయ పేర్కొన్నాడు. ఆ లక్షణాన్ని విశ్వనాథవారు వివరించి, నన్నయ రచించిన భారత భాగంలోని వివిధ కథలతో అన్వయించి చూపినారు. వ్యాస భారతంలో అనేక కథలున్నవి. ప్రతికథకు ఒక పరమార్థం ఉన్నది. నన్నయ ఆ కథలను తెలుగులో రచించేటప్పుడు ఆ పరమార్థం ప్రసన్నం అయే లాగా చేసినాడు. కథ ప్రసన్నంగా సాగుతూ ఉంటే దాని వెంట దాని పర మార్థము తేటపడుతూ ఉంటుంది. ఇది కథాకథనంలో విలక్షణమైన శిల్పము. వాక్యంలో విభిన్న శబ్దాల అర్థాలు స్పష్టంగా అవగతం అయినప్పుడు అఖండమైన వా[illegible]ర్థము ప్రసన్నమైనట్లు కథాగతమైన వివిధాంశాలు చక్కగా అవగతంఅయి నప్పుడు, కథయొక్క అఖండార్థం ప్రసన్న మవుతుంది. భారతంలోని కథల ఆ[illegible]పట్టులను పట్టుకొని వాని అభివ్యక్తికి కథలోని ఇతరాంశాలు ఎలా సహక రి[illegible]వో, ఆ కథలు అలా జరగడానికి మూలభూతమైన హేతువేమిటో విశ్వ నా[illegible]రు నిరూపించినారు. న[illegible]య కథన శిల్పమును గురించి యిట్టి పరిశీలన

యింతకు పూర్వం ఎవ్వరూ చేయలేదు. అపూర్వము, ఆశ్చర్యకరము అయిన ఈ కథనశిల్ప దర్శనము విశ్వనాథవారి ప్రతిభాసమున్మేషము.

గాంధారీ వివాహము, గరుడోపాఖ్యానము, యయాతి చరిత్ర, శౌకన్యో పాఖ్యానము మొదలైన కథలలోని రహస్యాలను వివరిస్తూ విశ్వనాథవారు ఆవిష్కరించిన నన్నయ కవితా శిల్పవైభవము కావ్య విమర్శలో క్రొత్తమార్గాన్ని నెలకొల్పిన దని చెప్పవచ్చును. నన్నయగారి రచన రసప్రధానమైన దని, సర్వకావ్యాంగాలను ఆయన రసాభిముఖంగా అనుసంధిస్తారని విశ్వనాథ వారు నిరూపించినారు నన్నయలోకజ్ఞతను, అనంతముఖమైన రచనాశిల్పాన్ని, ఛందోమర్మజ్ఞతను, నానారుచిరార్థ సూక్తినిధిత్వాన్ని, తెలుగు నుడికారాన్ని విశ్వనాథవారు అపూర్వమైన పద్ధతిలో నిరూపించి తమ కావ్యమర్మజ్ఞతను ప్రదర్శించినారు. నన్నయ భారతాన్ని అధ్యయనం చేయటానికి అపూర్వమైన పంథాను ప్రతిష్ఠించినారు.

అల్లసానివాని అల్లిక జిగిబిగి అని ప్రసిద్ధంగా ఉన్నచాటు పద్య పాదానికి విశ్వనాథవారు నవీనమైన వ్యాఖ్యానం చేసినారు. ఈ మాట అల్లసాని పెద్దన పద్యరచనకు సంబంధించినదనే అభిప్రాయం సామాన్యంగా ఉన్నది కాని ఈ అల్లిక జిగిబిగి పెద్దన ప్రబంధ నిర్మాణానికి మొత్తంగా వర్తిస్తుందని విశ్వనాథవారు నిరూపించినారు. మను చరిత్రలో వస్త్వైక్యం లేదనే విమర్శ ప్రచురంగా ఉన్నది మనుచరిత్రలో మూడు తరాల కథ ఉన్నది. ఈ కథలోని ఐక్యం ఏమిటో విశ్వనాథవారు నిరూపించినారు మనుచరిత్ర అసలు పేరు స్వారోచిష మనుసంభవము. స్వారోచిషుడు అనే మనువు సంభవించడానికి మూడుతరాల కథ ఎలా అవసరమో విశ్వనాథవారు నిరూపించినారు. మానవుల వర్తనను తీర్చి దిద్దవలసినవాడు మనువు. అట్టి మనువు జీవ సంపుటి యందు ఏయే మహాగుణములు ఉండవలెనో, ఆ మహాగుణాలు సమకూర్చడానికి కావలసిన సామగ్రి యేదో అది అంతా పెద్దన తన కావ్యంలో సమకూర్చినాడు. దివ్యత్వ మానవత్వ లక్షణముల సమ్మేళనంవల్ల అవతరించిన స్వారోచిష మనువు మానవలోక పాలనకు యోగ్యత సంతరించుకొనగలడు అనే కావ్య పరమార్థానికి అభిముఖంగా పెద్దన కథను చక్కగా అల్లిన శిల్పాన్ని విశ్వనాథవారు ప్రతిభాన్వితంగా ప్రదర్శించినారు.

ప్రవరుడు, వరూధిని మొదలైన పాత్రలను చిత్రించడంలో పెద్దన ప్రదర్శించిన నైపుణిని కూడా విశ్వనాథవారు అద్భుతంగా నిరూపించినారు. ప్రవరుడు ధర్మనిష్ఠగల గృహమేధి. పరమ సుందరుడు, సౌందర్య దృష్టికల వాడు. భోగవిముఖుడు కాడు; స్వకాంతా భోగ సుముఖుడు. వరూధిని అనన్య కాంత; అన్యపురుష చిత్తకాదు పరమ సుందరుడైన పురుషుడు ఆమె భావనలో ఉన్నాడు. అట్టివాని కోసం ఆమె నిరీక్షిస్తున్నది. ప్రవరు డట్టివాడు. ఆమె అతనితో భోగింప గోరినది. ప్రవరుడే అన్న ప్రత్యయంతో మాయా ప్రవరునితో భోగించి సంతానవతి అయినది. ఈ గ్రంథం చివరి భాగంలో విశ్వనాథవారు చేసిన ఆనందమీమాంస. సామాన్యులు చేయగలిగింది కాదు. మనచరిత్రపైన వెలువడిన విమర్శలలో విశ్వనాథవారి గ్రంథం పరమోత్తమమైనది అనటంలో సందేహం లేదు. కావ్యానికి రసమేకాక రసేతరమైన పరమార్థం కూడా ఉన్నదనీ, మహాకవి రసానికీ ఆ పరమార్థానికీ అభిముఖంగా కావ్యాంగాలను సంధిస్తూ ఉంటాడని, ఈదృశమైన శిల్పాన్ని దర్శించటమే ఉత్తమ విమర్శ అని విశ్వనాథవారి అభిప్రాయం.

ఒకడు నాచన సోమన్న అనే విమర్శ గ్రంథంలో విశ్వనాథవారు నాచన సోమనాథుని నవీన గుణ సనాథత్వాన్నీ, సంవిధాన చక్రవర్తిత్వాన్ని చక్కగా నిరూపించినారు. సోముని ఉత్తర హరివంశంలో పరస్పరం అసంబద్ధాలుగా కనబడే కొన్ని కథలు మాత్రమే రచింపబడినవి. ఈ కథలలో ఉన్న ఏకవాక్యతా స్వరూపాన్ని విశ్వనాథవారు నిరూపించినారు. ఉత్తర హరివంశము విష్ణు పారమ్యాన్ని బోధించే కావ్యము. నరకాసురవధ, విప్రకుమారులను బ్రతికించడం, ఘంటాకర్ణునకు ఇంద్రపదవి ఇవ్వడం, పౌండ్రక వాసుదేవుని, హంసడిభకులను సంహరించడం. బాణాసుర కథ మొదలైన వృత్తాంతాలన్నీ విష్ణు పారమ్యాన్ని బోధించేవే. సోమన్న వీటినే గ్రహించడం ద్వారా ఖండఖండాలుగా కనిపించే కథలకు అఖండార్థం ఏర్పడినదని విశ్వనాథవారు వివరించారు. విష్ణువు విశ్వాంతరాళంలోని సర్వగోళాల మీద ఆధిపత్యం కలవాడు. లోకంలోని జనన మరణాలు ఆయన ఆధీనంలో ఉంటవి.

ఇంద్రాదులను ఆయనయే నియమిస్తాడు. దుష్ట శిక్షణ, లోక స్థితి కారత్వం ఆయన కర్తవ్యాలు. పై కథలలో నాచన సోమన విష్ణువుయొక్క ఈ లక్షణాలను ధ్వనింపజేసి తన కావ్యానికి విష్ణు పారమ్య రూపమైన యేక

వాక్యత సాధించి సంవిధాన చక్రవర్తి అయినాడని విశ్వనాథవారు నిరూపించినారు. ఊర్వశీ నరకాసురుల సంవాదంలోని శిల్పం, సత్యభామ యుద్ధంలోని రస సంసృష్టి, జనార్దన రాయబారంలోని పరమార్థం, నరకాసురుని కథకు ఖగోళ శాస్త్ర పరంగా చేసిన వ్యాఖ్యానం విశ్వనాథవారి విమర్శనా వైభవానికి నిదర్శనాలుగా ఉన్నవి.

విశ్వనాథవారి కవి హృదయజ్ఞతకు కావ్య మర్మజ్ఞతకు పరమోత్తమ నిదర్శనమైన గ్రంథం శాకుంతలము యొక్క అభిజ్ఞానత.

మహాకవులు శబ్దాలను సామాన్య పాఠకుల కోసం రూఢార్థంలోను ప్రౌఢులైన తత్వాన్వేషకుల కోసం యౌగికార్థంలోను ప్రయోగిస్తారని విశ్వనాథవారు, కాళిదాసు శాకుంతలాన్ని పరిశీలిస్తూ నిరూపించినారు. శాకుంతల నాటక కథలో దుష్యంతుని విస్మృతి అయువుపట్టు. ధర్మారణ్యంలో గజం ప్రవేశించడం ఈ విస్మృతికి వ్యంజకము. "గజతి మాద్యతి ఇతి గజః"-మదించునది గజము. మదము విస్మృతికి హేతువు. శాకుంతలమున ప్రధాన రసము శృంగారము. దుష్యంతుని యొక్క విస్మృతివల్ల దానికి విచ్ఛిత్తి ఏర్పడుతుంది. అలా ఏర్పడకుండా కాళిదాసు ఈ విస్మృతి లక్షణాలన్నీ విచిత్రంగా నిరూపించినాడు విస్మృతికి కారణం దుర్వాస శ్శాపము. అది దుష్యంతుని అంతఃకరణలో ఒక అంశాన్ని మాత్రమే స్పృశించింది. లౌకికమైన మనస్సు మాత్రమే శాపానికి గురి అయినది. తక్కిన అంతఃకరణం జాగృతంగా ఉన్నది. "సతాంహి సందేహ పదేషు వస్తుషు ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తయః" అని కాళిదాసు దుష్యంతునిచే పలికించినాడు. శకుంతల తొలిసారి కనబడినప్పుడు ఆమె క్షత్ర పరిగ్రహయోగ్య అని అంతఃకరణము చెప్పగా దుష్యంతుడామెను భార్యగా గ్రహించినాడు. రెండవసారి సభలో కనబడినప్పుడు మనస్సు విస్మృతి వశమై ఉండుటవల్ల ఆమె స్వీకార్య అని అంతఃకరణం చెప్పలేదు. దుష్యంతుడామెను నిరాకరించినాడు.

స్త్రీణా మశిక్షిత పటుత్వ మమానుషీషు
సందృశ్యతే కిముత యాః ప్రతిబోధవత్యః
ప్రాగంతరిక్ష గమనాత్ స్వమపత్య జాత
మన్యైర్ద్విజైః పరభృతాః ఖలు పోషయంతి"

అనే శ్లోకంలో దుష్యంతుని శకుంతలా వృత్తాంత జ్ఞానం తొంగి చూస్తున్నది. అది అతని అంతఃకరణంలో మెదలుతున్నది గాని విస్మృతి వివశమై యున్న మనసులోనికి రావడంలేదు. ఈఘట్టంలో విస్మృతిపాలబడిన మనసు, జాగృతమై ఉన్న అంతఃకరణం ఎలా జంటగా ప్రవర్తిస్తున్నవో కాళిదాసు అద్భుతంగా ప్రదర్శించినాడని విశ్వనాథవారు వివరించినారు.

నాందీ శ్లోకంలో నాటకకథా నిర్మాణలక్షణం ఎలా వ్యంగ్యం చేయబడినదీ, నాటకములో శివస్వరూపం, అంతఃకరణ లక్షణం, సత్పురుష లక్షణం, శృంగార రస స్వరూపం ఏ విధంగా నిరూపితమైనదీ, విదూషకుడు దుష్యంతుని మనఃస్థానీయుడని చెప్పడానికి ఎలా అవకాశం ఉన్నదీ విశ్వనాథవారు ఆశ్చర్యకరమైన ప్రతిభతో నిరూపించినారు. కాళిదాసుని శాకుంతల నాటకం మీద వెలువడిన విమర్శలలోకెల్ల విశ్వనాథవారి గ్రంథం ఉత్తమోత్తమ మైనదని చెప్పడానికి ఏమాత్రం శంకించ నక్కరలేదు.

'విశ్వనాథ సాహిత్యోపన్యాసములు' అనే వ్యాససంపుటిలోకూడా వారి విమర్శనా దక్షతను ప్రదర్శించే వ్యాసాలు ఉన్నవి కాళిదాస భవభూతులు, శాంత కరుణరసములు, మహాభారత రామాయణములు అనే వ్యాసాలలో వారు చేసిన నిశిత పరిశీలనలు, తేల్చిన నిర్ణయాలు వారి సాహిత్య శాస్త్ర పరిజ్ఞానానికి, హేతు బద్ధ వివేచనకు నిదర్శనాలుగా ఉన్నవి. ''రామాయణ మహాభారతములు అజ్ఞుడైన మానవునినుండి పరమ విజ్ఞుడైన మానవుని వఱకు సమాకర్షింపబడుటకు యోగ్యమైన సర్వాల్ప మహా విషయ లక్షణ సామగ్రీ సంపూర్ణమై యున్నవి. "అని వారు నుడివిన మాట మహాగ్రంథములను విమర్శింపబూనేవారికి కనువిప్పు కలిగించగల మహోపదేశము.

"కావ్యపరీమళము" అనే గ్రంథంలో ప్రాచీన ప్రబంధాలనుండి ఎన్నిక చేయబడిన పద్యాలకు విశ్వనాథవారి రసవద్వ్యాఖ్యానాలు కలవు. "సాహిత్య సురభి" అనే గ్రంథంకూడా ఇటువంటిదే. కావ్యానందము అనే గ్రంథంలో వారుచేసిన సాహిత్య మీమాంసకూడా వారి ప్రగాఢ కావ్యపరిశీలనకు లక్ష్యంగా ఉన్నది.

పత్రికలలోను, విజ్ఞాన సర్వస్వాలలోను, వ్యాసాల రూపంలోను, పెక్కు గ్రంథాలకు పీఠికల రూపంలోగూడ విశ్వనాథవారు చేసిన విమ

ర్శలు లెక్కకు మిక్కిలిగా ఉన్నవి. తెలుగులో సాహిత్య విమర్శ విశ్వనాథవారి చేతులలో సంపూర్ణ వికాసాన్ని పొందినదని చెప్పవచ్చును. ఆయన తరచి చూచినదానికంటె ఎక్కువ లోతుగా కావ్యాన్ని తరచి చూడ టం సాధ్యంకాదేమో అనిపిస్తుంది. ఒక్కొక్క కావ్యంలో ఆయన ఉన్నవని చూపిన రహస్యాలు నిజంగా ఉన్నవా అని శంకించేవారు, ఆ రహస్యాలన్నీ ఆయన ప్రతిభా విలాసాలే కాని ఆకావ్యాలలో ఉన్నవి కావని భావించే వారు ఉన్నారు. అలాంటి వారికి ఆయన సమాధానాలు —

"ఇది యంతయు కల్పనయని చెప్పుటకు చాల వీలున్నది. కల్పనకాదు. విచార లక్షణము. అందుకనియే, 'వ్యాఖ్యానతో విశేష ప్రతిపత్తిః, నహి సం దేహాద లక్షణమ్" అన్నారు."

"ఇట్టి యరములు చెప్పినపుడు కొందరు నేడు విజ్ఞులైన వారు కూడ నీవు చెప్పినయరములు కవి యుద్దేశించినవి కావందురు. ఇట్లన్నచో కాళిదాసాదు లందుచెప్పెడి విశేషములన్నియు వ్యర్థములగును. వట్టి తాత్పర్యమే నిలుచును. వ్యంగ్యాదులకు-ధ్వనులకు ప్రసక్తి లేకుండ పోవును కవితారచన మన్నది యొక విద్య కాకపోవును. బహువిధములైన శిల్పముల ప్రసక్తి లేకపోవును!"

విశ్వనాథవారి విమర్శల పరమ్మారము భావుకులైన విద్వాంసులే గ్రహింపగలరు. సామాన్యులకు వానిని వివరించి చెప్పవలసియే ఉంటుంది. ఆయన కవిత యెంత ప్రౌఢమో విమర్శయు అంత ప్రౌఢము.

ప్రాచీన నవీన కావ్యాలపైన, సాహిత్య ప్రక్రియలపైన, పరిశోధన రూపంలో, పరిశీలన రూపంలో సమీక్షారూపంలో వ్యాఖ్యానాల రూపంలో విమర్శ విస్తృతంగా జరిగినది. గ్రంథాలు, వ్యాససంపుటాలు, పత్రికావ్యాసాలు, పీఠికలు అసంఖ్యాకంగా వెలసినవి.

నన్నయ్య అనువాదపద్ధతి, కథాకథననైపుణి, వర్ణనాశక్తి, రసపోషణ, పాత్రచిత్రణ, లోకజ్ఞత, శైలి మొదలైన విషయాలను సోదాహరణంగా వివ రిస్తూ ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు "నన్నయ భారతము" అనే గ్రంథాన్ని ప్రకటించారు.

తిక్కన సోమయాజి కవితా వైభవాన్ని, రచనా పరమార్థాన్ని వివరిస్తూ "తిక్కన—భారతము" అనే గ్రంథాన్ని భూపతి లక్ష్మీనారాయణ రావుగారు ప్రకటించినారు. కాశూరి వ్యాసమూర్తిగారు 'తిక్కన కళా సామ్రాజ్యము' అనే గ్రంథంలో తిక్కన కథా పాత్ర చిత్రణ శిల్పాలు వివరించారు. "తిక్కన కావ్యశిల్పము" అనే సిద్ధాంత గ్రంథంలో డాక్టరు కేతవరపు రామకోటి శాస్త్రిగారు నిర్వచనోత్తర రామాయణంలోను, భారతంలోను ప్రదర్శించిన కావ్యకళా నైపుణిని సమీక్షించినారు. తెలుగు భారతాన్ని స్వతంత్ర కావ్యంగా పరిశీలించ వలసినదేనని వ్యాసభారతంతో పోల్చి చూడటం సమంజసం కాదని డా॥ శాస్త్రిగారు చెప్పినమాట సమంజసమే అనిపిస్తుంది.

కవిత్రయ కవితా విమర్శ సమష్టిగా చేసిన గ్రంథాలలో కోరాడ రామకృష్ణయ్యగారి ఆంధ్రభారత కవితా విమర్శనము, గుత్తుం వెంకట సుబ్బరామయ్యగారి 'కవిత్రయ కవితా విమర్శనము' పేర్కొనదగినవి. ఆంధ్ర సారస్వత పరిషత్తు వారు ప్రకటించిన "ఆంధ్ర మహాభారతోపన్యాసములు" పలువురు విద్వాంసులు భారతమందలి ఆయా పర్వముల రచనను సమీక్షించిన వ్యాసములతో కూర్చబడిన గ్రంథము.

నన్నెచోడుని కవితపై వెలసిన తొలివిమర్శ గ్రంథము శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రిగారి "నన్నెచోడదేవ కుమార సంభవ విమర్శనము". ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు నిర్వహించిన పోటీలో పాల్గొన్న వేదం వెంకటరాయ శాస్త్రి, అమరేశం రాజేశ్వర శర్మ రచించిన "నన్నెచోడుని కవిత్వం" అనే గ్రంథాలు, తిమ్మావఝ్ఝల కోదండ రామయ్యగారి "కవిరాజ శిఖామణి" నన్నెచోడుని ప్రతిభను చక్కగా ప్రదర్శించినవి. "కుమార సంభవ తత్త్వము" అనే పేరుతో వేదాల తిరువెంగాళాచార్యులవారు ప్రకటించిన గ్రంథం నన్నెచోడని కవితా శిల్పాన్ని సర్వథా నిరసించినది.

తిక్కన శిష్యుడైన కేతనను గురించి డాక్టర్ హరి శివకుమార్ 'కేతన' అనే సిద్ధాంత గ్రంథంలో సమగ్ర పరిశీలన చేసినారు. మారనపై డాక్టర్ జి. వి. సుబ్రహ్మణ్యంగారు కావించిన సునిశిత పరిశోధన ఫలితాలు "ప్రథమాంధ్ర మహాపురాణము" అనే గ్రంథంగా ప్రకటింపబడినవి. ఈ గ్రంథంలో డా॥

సు బ్రహ్మణ్యంగారి శాస్త్రీయము సిశితము అయిన పరిశీలనా శక్తి సువ్యక్తమయినది.

నాచన సోమనాథుని, ఎఱ్ఱాప్రెగ్గడను తులనాత్మకంగా పరిశీలించిన తొలి గ్రంథం వేలూరి శివరామ శాస్త్రిగారి 'సోముడు'. ఈ విషయంలో సమగ్రము, గంభీరమూ అయిన పరిశోధన చేసినవారు డాక్టర్ వి. యశోదారెడ్డిగారు. వారి 'తెలుగులో హరివంశము' అనే గ్రంథము వారి పరిశోధనా ప్రాగల్భ్యానికి నిదర్శనంగా ఉన్నది. సమకాలికులైన ఇరువురు మహాకవులు రచించిన సమాన వస్తుకములైన గ్రంథాలను నిష్పాక్షికంగా కూలంకషంగా పరిశీలించిన విమర్శ గ్రంథాలలో డాక్టర్ యశోదారెడ్డిగారిదే మొదటిది అనవచ్చును.

శ్రీనాథకవి సార్వభౌముని గూర్చి వెలువడిన విమర్శ సాహిత్యము కొంత విస్తృతంగానే ఉన్నది. గడియారం వెంకట శేషశాస్త్రిగారి "శ్రీనాథుని కవితా సామ్రాజ్యము", ఉస్మానియా విశ్వవిద్యాలయ విద్యార్థులు సమకూర్చిన శ్రీనాథభారతము', కుందూరి ఈశ్వర దత్తుగారి "శ్రీనాథ మహాకవి", చిలుకూరి పాపయ్యశాస్త్రిగారి 'శ్రీనాథ కృతి సమీక్ష" పేర్కొనదగినవి. డాక్టర్ కొర్లపాటి శ్రీరామమూర్తిగారి 'శ్రీనాథుడు' అనే సిద్ధాంత గ్రంథం ప్రత్యేకంగా పేర్కొనదగినది.

పోతన్నపై వెలసిన విమర్శ గ్రంథాలలో పేర్కొనదగ్గవి ఆంధ్ర సారస్వత పరిషత్తువారు విద్వాంసులచే వ్రాయించి ప్రచురించిన "ఆంధ్ర మహాభాగవతోపన్యాసములు", తుమ్మలపల్లి రామలింగేశ్వరరావుగారి 'పోతన్నగారి సహజ పాండిత్యము", ఖండవల్లి సూర్యనారాయణశాస్త్రిగారి "పోతన మహాభాగవత రచన", డాక్టర్ ప్రసాదరాయ కులపతిగారి' ఆంధ్ర భాగవతవిమర్శ. పోతన్నపై రచించబడిన విమర్శలలో అత్యుత్తమమైనది, సమగ్ర సుందరమైనది డాక్టర్ ధూళిపాళ శ్రీరామమూర్తిగారి "శ్రీమదాంధ్ర మహాభాగవతానుశీలనము" అనే సిద్ధాంత గ్రంథము. పోతన కథా కథన శిల్పము, భావుకత, వర్ణనానైపుణి, అలంకారముల తీర్పు, రస పాత్రపోషణ హృదయంగమంగా ఈ గ్రంథంలో వివరించబడినవి. సహజ పాండిత్యుడైన పోతనగారి ప్రౌఢ

కవితా శిల్పస్వరూపాన్ని తెలుగు వారికి తొలిసారిగా ప్రదర్శించిన ఉత్తమ విమర్శ గ్రంథమిది.

అల్లసాని పెద్దనను గూర్చిన విమర్శలలో జనమంచి శేషాద్రి శర్మ గారి 'మనుచరిత్ర హృదయావిష్కరణము', డాక్టర్ పల్లా దుర్గయ్యగారి "చతుర వచోనిధి" పేర్కొనదగినవి. మనుచరిత్రలోని దృశ్యకావ్య పద్ధతిని, కావ్య సందేశాన్ని, చతుర వచోనిధిత్వాన్ని డాక్టర్ దుర్గయ్యగారు పరమ భావుకతతో నిరూపించినారు.

నంది తిమ్మనపై వెలువడిన 'పారిజాతాపహరణ పర్యాలోచనము' మంచి విమర్శ గ్రంథము. ఇందులో డాక్టర్ యశోదా రెడ్డిగారు తిమ్మన కవిత్వ పాం డిత్యాలను నిశితంగా పరిశీలించినారు. కన్నడంలోని రుద్రభట్టు జగన్నాథ విజ యమును తిమ్మన అనుసరించలేదని, ఇరువురు కవులు హరివంశాన్ని అనుస రించారని శ్రీమతి రెడ్డిగారు నిరూపించినారు.

ఆముక్తమాల్యదపై వెలసిన గ్రంథాలలో వెల్దండ ప్రభాకరామాత్యుల 'పర్యాలోకనము', డాక్టర్ తుమ్మపూడి కోటీశ్వర రావుగారి 'ఆముక్త మాల్యదా సౌందర్యము' పేర్కొనదగినవి. డాక్టర్ కోటీశ్వరరావుగారి గ్రంథంలో రసము, కథాకథనము, నిర్మాణము, మార్మికత, ఋతువర్ణనలు, మతవిషయము మున్నగు అంశములు ప్రతిభాన్వితంగా విపులంగా విమర్శింపబడినవి.

రామరాజ భూషణునిపై పలువురు పండితులు రచించిన వ్యాసములు "భూషణ కిరణావళి" అనే పేరున ప్రకటించబడివి. 'వసుచరిత్ర సాహితీ సౌర భము' అనే పుట్టపర్తి నారాయణాచార్యులవారి ఉపన్యాస సంకలనంలో రామ రాజ భూషణుని ఉక్తి చమత్కారము, పద ప్రయోగనైపుణి, పద్య రచనా శిల్పం, కథాకల్పన, సంగీతాది విద్యా రహస్యజ్ఞత వివరింపబడినవి.

రాయల యుగంలో వర్ధిల్లిన అష్టదిగ్గజములనబడే కవులను గూర్చిన గ్రంథాలలో ఉస్మానియా విశ్వవిద్యాలయాంధ్ర శాఖ పక్షాన ప్రకటించబడిన 'అష్టదిగ్గజములు', చిన్నకోట మాధనరావుగారి 'కావ్యరీతులు', శిష్టా లక్ష్మీకాంత శాస్త్రిగారి 'విజయ నగరాంధ్రకవులు', వంగల శ్రీ రామావధానిగారి 'ప్రబంధ భావ ప్రకాశిక' పేర్కొనదగినవి. ఈ సందర్భంలోనే ప్రత్యేకంగా చెప్పుకో

దగ్గవి డాక్టర్ వల్లా దుర్గయ్యగారి 'ప్రబంధ వాఙ్మయ వికాసము', పుట్టపర్తి నారాయణాచార్యులవారి 'ప్రబంధ నాయికలు' కేశవపంతుల నరసింహశాస్త్రిగారి 'ప్రబంధ పాత్రలు'.

యువభారతివారు విద్వాంసులచే వ్రాయించి ప్రకటించిన 'కావ్యలహరి' 'ప్రతిభాలహరి', కూడా ఇక్కడ పేర్కొనదగినవి.

వేమనను గురించి వెలువడిన గ్రంథాలలో ముఖ్యంగా చెప్పుకోదగ్గవి పంగూరి సుబ్బారావుగారి 'వేమన', రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారి 'వేమన చరిత్ర'.

కొన్ని సాహిత్య ప్రక్రియలను గురించి, కావ్యాంగాలను గురించికూడ విపులములయిన విమర్శగ్రంథాలు వెలువడినవి.

జానపద సాహిత్యాన్ని గురించి ప్రచురింపబడిన గ్రంథాలలో చేకుమళ్ళ అచ్యుతరావుగారి 'ఆంధ్రపదములు-పాటలు", తెలుగు భాషాసమితి బహుమతి పొందిన హరి ఆదిశేషువుగారి "జానపద గేయవాఙ్మయ పరిచయము", నేదునూరి గంగాధరంగారి 'జానపదగేయ వాఙ్మయవ్యాసావళి', డాక్టర్ బలరామ రాజుగారి 'తెలుగు జానపదగేయ సాహిత్యము' అనే సిద్ధాంత గ్రంథము ముఖ్యమైనవి.

యక్షగానములపై డాక్టర్ యస్. వి. జోగారావుగారి "యక్షగాన వాఙ్మయచరిత్ర", ద్విపద వాఙ్మయంమీద డాక్టర్ జి. నాగయ్యగారి 'ద్విపద వాఙ్మయము' అనే సిద్ధాంతగ్రంథాలు వెలువడినవి. వచన వాఙ్మయం మీద డాక్టర్ యమ్. కులశేఖరరావుగారి "ఆంధ్రవచన వాఙ్మయము-ఉత్పత్తి వికాసములు" అనే సిద్ధాంత గ్రంథము. ఉదాహరణ కావ్యాలమీద నిడదవోలు వెంకటరావుగారి "ఉదాహరణ వాఙ్మయము" వెలువడినవి.

వివిధ రసములను గురించికూడ ప్రత్యేకగ్రంథములు ప్రకటిలపబడినవి. ముట్నూరి సంగమేశంగారి 'తెలుగుహాస్యము', మాణిక్యం వేదవల్లి తాయారమ్మగారి "తెలుగు సాహిత్యములో హాస్యరసము," మునిమాణిక్యం నరసింహరావుగారి "మన హాస్యము" అనే గ్రంథాలు హాస్యరస స్వరూపభేదాలను చక్కగా విశ్లేషించి, తెలుగు సాహిత్యానికి అన్వయించి చూపినవి డాక్టర్

జి. వి. సుబ్రహ్మణ్యంగారి "వీరరసము" అనే గ్రంథం సాహిత్యఅకాడమీ బహుమతి పొందినది. వీరరస స్వరూపాన్ని, తద్భేధాలను విపులంగా చర్చించి, ఆంధ్ర సాహిత్యంలో వివిధ కావ్యప్రక్రియలలో వీరరస భేదాలను డాక్టర్ సుబ్రహ్మణ్యంగారు నిపుణంగా నిరూపించినారు.

కావ్యాంగాలలో ఒకటి అయిన ఛందస్సును గూర్చి డాక్టర్ పాటిబండ మాధవశర్మగారు "ఆంధ్ర మహాభారతము-ఛందః శిల్పము" అనే సిద్ధాంత గ్రంథాన్ని ప్రకటించినారు. ఛంద స్తత్వం, ఛందోంగాలు, ఛందోవృత్తిరీతులు మొదలయిన అంశాలు శరీర జీవ మనస్తత్వశాస్త్రాల ఆధారంతో నిర్ణయించి, ఆంధ్ర మహా భారతంలో వివిధ ఛందములు ఎలా వస్తురస భావానుకూలంగా నిర్మింపబడినవో డాక్టర్ శర్మగారు పరిశీలించినారు.

తెలుగులో వెలువడిన విమర్శ సాహిత్యాన్ని సమీక్షిస్తూ డాక్టర్ యస్.వి. రామారావుగారు ప్రచురించిన 'తెలుగులో సాహిత్య విమర్శ' అనే సిద్ధాంత గ్రంథంకూడా ప్రకటితమైనది. తెలుగు సాహిత్యం ఆరంభమైన నాటినుండి నేటివరకు విమర్శ ఎలా అవతరించి వికసించి, విస్తరించిందో ఈ గ్రంథంలో విపులంగా చర్చించ బడినది,

సాహిత్యలక్షణాలను వివరిస్తూ పెక్కు లక్షణ గ్రంథాలుకూడా వెలువడి నవి. సంస్కృతాలంకార గ్రంథాల అనువాదాలు పెక్కు ప్రకటింపబడినవి. వాటిలో చెలమచెర్ల రంగాచార్యులవారి 'ప్రతాపరుద్ర యశోభూషణము', వేదాల తిరువెంగళాచార్యులవారి 'కావ్యాలంకారసూత్రవృత్తి', 'ధ్వన్యాలోకము'; జమ్మలమడక మాధవరామశర్మగారి 'రస గంగాధరము', 'ధ్వన్యాలోకము', 'నాట్యవేదము'; ధరణికోట వెంకట సుబ్బయ్యగారి 'రసగంగాధరము'. శేట్టి లూరి వేంకట రాఘవ అయ్యంగారి 'కావ్యాత్మ', డాక్టర్. పి. యస్. ఆర్. అప్పారావుగారి 'నాట్యశాస్త్రము' ముఖ్యంగా పేర్కొనదగినవి. "నరసభూపాలీ యము"నకు సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారి వ్యాఖ్యానము విద్యార్థులకు మిక్కిలి ఉపయోగకరము. స్వతంత్రంగా రచించబడిన లక్షణ గ్రంథాలలో జొన్నలగడ్డ సత్యనారాయణ మూర్తిగారి 'సాహిత్య తత్త్వవిమర్శనము', విన్న కోట మాధవరావుగారి "కావ్యశిల్పము", విశ్వనాథ సత్యనారాయణగారి 'కావ్యా నందము', ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారి "సాహిత్య శిల్ప సమీక్ష". ఆచార్య కె. వి. ఆర్. నరసింహంగారి 'సాహిత్యదర్శనము' పేర్కొనదగినవి.

వ్యాససంపుటములుగా వెలువడిన విమర్శ యెంతో కలదు. నడకుదుటి వీరరాజుగారి 'విమర్శ తరంగిణి', ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారి 'వ్యాసావళి'. ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారి 'లక్ష్మీరంజన వ్యాసావళి', ముట్నూరి కృష్ణారావుగారి 'సమీక్ష', శిష్టా రామకృష్ణశాస్త్రిగారి 'విమర్శ వ్యాసములు' ఆచార్య పింగళిలక్ష్మీకాంతంగారి 'గౌతమ వ్యాసములు', పిల్లలమర్రి హనుమంత రావుగారి 'సాహిత్య సమాలోచనము', దేవులపల్లి రామానుజరావుగారి 'నవనీతము', 'వ్యాసమంజూష', రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారి 'సారస్వతాలోకము', బూర్గుల రామకృష్ణరావుగారి "సారస్వత వ్యాస ముక్తావళి" డాక్టర్ యస్. వి. జోగారావుగారి 'సప్తతంతువు', భూపతి లక్ష్మీనారాయణరావుగారి 'కావ్య దర్శనము', డాక్టర్ కేతవరపు రామకోటి శాస్త్రిగారి 'నైమిశము', కాటూరి వేంకటేశ్వరరావుగారి 'సాహిత్యదర్శనము', గుంటూరి శేషేంద్ర శర్మగారి 'సాహిత్యకౌముది', డాక్టర్ జి. వి. సుబ్రహ్మణ్యంగారి 'సారస్వత సౌరభము', 'నవ్యాలోకము', కాశూరి హనుమంతరావుగారి 'సాహితీజగతి', 'వాఙ్మయ సమాలోచనము', క్రొత్త సత్యనారాయణ చౌదరిగారి 'సాహితి', డాక్టర్ జి.వి. కృష్ణారావుగారి 'ఉదబిందువులు', తిరుమల రామచంద్రగారి 'సాహితీ సుగతుని స్వగతం', యువభారతివారు ప్రచురించిన 'మహతి', 'రచన', 'వికాసలహరి', కళాస్రవంతివారి 'సాహితీ మంజూష' మొదలయినవి పేర్కొన దగినవి.

౫

ఇంతవరకు పేర్కొనబడిన విమర్శ సాహిత్యం అంతా ముఖ్యంగా ప్రాచీన కావ్యాలకు సంబంధించినది. ఆధునిక సాహిత్యాన్ని గురించిన విమర్శ కూడా తగుమాత్రంగా ప్రచురించబడినది. ఎక్కువ భాగం కవిత్వానికి సంబంధించినదిగనే ఉన్నది. నవల, నాటకం, నాటిక, కథానికలాంటి ప్రక్రియలమీద విమర్శ ఉండవలసినంతగా లేదని చెప్పవచ్చును.

ఆధునిక సాహిత్యం అంటే కందుకూరి వీరేశలింగం పంతులుగారితో ప్రారంభమైన సాహిత్యం అన్నమాట. ఆయన నాటినుంచి సృష్టియైన సాహిత్యాన్ని గురించి, ఆ సాహిత్యాన్ని సృష్టించిన రచయితలను గురించి పరిశోధన రూపంలోను, విమర్శనరూపంలోను కొంత వాఙ్మయం వెలువడినది.

వీరేశలింగం పంతులుగారి మీద డాక్టర్ అక్కిరాజు రమాపతిరావుగారు చేసిన పరిశోధన ఫలితాలు "వీరేశలింగంపంతులు-సమగ్ర పరిశీలన" అనే గ్రంథరూపంలో ప్రచురించ బడినవి. పంతులుగారు రచించిన నవలలు, నాటకాలు, కథలు, కవులచరిత్ర, ప్రహసనాలు, గద్యపద్యకావ్యాలు ఈ గ్రంథంలో పరిశీలించబడినవి. పంతులుగారి పత్రికా నిర్వహణ, స్వీయచరిత్ర రచన, హాస్యరచయితగా వారికి గల స్థానం, వారిశైలి మొదలయిన అంశాలను గూడా డా. రమాపతి రావుగారు పరామర్శించినారు.

పానుగంటి లక్ష్మీనరసింహరావు పంతులుగారి సాహిత్యాన్ని గురించి డాక్టర్ ముదిగొండ వీరభద్రశాస్త్రిగారు "పానుగంటివారి సాహిత్యసృష్టి" అనే పరిశోధన గ్రంథాన్ని ప్రకటించినారు. పానుగంటివారి జీవిత విశేషాలు, వారు రచించిన నాటకాలలోని సన్నివేశకల్పన, పాత్రచిత్రణ, సంభాషణ రచనా ప్రాగల్భ్యం, సాక్షి ఉపన్యాసాలు, కథలు మొదలయినవి ఈ గ్రంథంలో పరామర్శించ బడినవి,

శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవుల సాహిత్యాన్ని గురించి శిష్టా లక్ష్మీకాంత శాస్త్రిగారు "తిరుపతి కవుల సాహిత్య సమీక్ష" అనే గ్రంథాన్ని ప్రకటించినారు. ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీవారు నిర్వహించిన పోటీలో ఈ గ్రంథం బహుమతి అందుకున్నది. తిరుపతి కవుల నాటకాలు, వివిధ పద్యకావ్యాలు, గద్యరచనలు, విమర్శలు ఈ గ్రంథంలో కూలంకషంగా పరామర్శించబడినవి.

గురజాడ అప్పారావుగారి మీద శ్రీశ్రీ రచించిన "గురజాడ" అనే వ్యాస సంకలనము గురజాడ ప్రారంభించిన ముత్యాలసరం అనే ఛందస్సు పుట్టుపూర్వోత్తరాలను గురించి, ఆయన వచనరచనా నైపుణిని గురించి, ఆయన ప్రగతి శీలమైన సామాజిక దృక్పథాన్ని గురించి, ఆయన వ్యావహారిక భాషావాదాన్ని, విశ్వజనీనతను గురించి శ్రీశ్రీ వివరించారు. కన్యాశుల్క నాటకాన్ని గురించి శ్రీశ్రీ చెప్పిన వాక్యాలు గమనించదగ్గవి. "గిరీశం రామప్ప పంతులు, లుబ్ధావధాన్లు మొదలైనవారు నవ్వు పుట్టించేటట్లు మాట్లాడే ట్రాజిక్ హీరోలు. వీరిది శిథిలీకృత మవుతున్న ఒకానొక సాంఘిక వ్యవస్థ యొక్క కరాళనృత్యం." "కన్యాశుల్కం బీభత్సరస ప్రధానమైన విషాదాంతనాటకం."

గురజాడవారి కవిత్వంలో "దేశభక్తి" అనే గేయం ప్రపంచ సాహిత్యంలోనే గొప్ప స్థానాన్ని పొందదగినది అని శ్రీశ్రీ అభిప్రాయం.

ఈ గ్రంథంలో శ్రీశ్రీ అక్కడక్కడా కవిత్వాన్ని గురించి ప్రకటించిన అభిప్రాయాలుగూడా గమనించదగ్గవి. "ప్రారంభం, నిర్వహణ, ఉపసంహారం ఇవే కళావస్తువు నాణ్యం తెలియజేసే నికషాలు."

"సంవిధానము (Technique) వ్యాకరణచ్ఛందస్సులేకాక తదతీత మైన ఒక విపులవ్యవస్థ. కవి తనలో అంతర్గతమైన రసాన్ని పాఠకునిలో బహిర్గతము చేయగలుగుతున్న కార్యమే సంవిధానము. దీనికి ఆఘాతం కలిగితే రసానికే విప్రతిపత్తి సంఘటిల్లినట్లు. కాపున తుట్టతుదకు రీతినదాలు రససము ద్రంలోనికే చేరుకుంటాయి."

"సామాజిక చారిత్రిక పరిణామ గమనంలో కవియొక్క సాహిత్య స్థానం నిర్ణీతమవుతుంది. కవి ప్రగతిశీలి, ప్రతిభాశాలి, అయితే ఈ గమనాన్ని అతడు మరింత వేగవంతం చేస్తాడు."

"మహత్తర భావాలను మహత్తర విధంగా ప్రతిపాదించినదే ఉత్కృష్ట కవిత్వం."

"మానవుడు మహాకవి అయినప్పుడు అతీంద్రియ జ్ఞానంతో పని చేస్తాడు. అప్పుడతని వాక్కు ఆది మధ్యాంతరహిత మవుతుంది".

గురజాడ అప్పారావుగారిని గురించి వెలువడిన మరొక గ్రంథం 'గురజాడ వెలుగుజాడ' కె. వి. రమణారెడ్డిగారు గురజాడను గురించి ఆయా పత్రికలలో ప్రకటించిన వ్యాసాలు ఈ గ్రంథంగా సంకలనం చేయబడినవి గురజాడ జీవిత విశేషాలు, సాహిత్య దృక్పథం, కవిత్వ సిద్ధాంతాలు, లోక పరిశీలనం, ఆయనపైన పాశ్చాత్యుల ప్రభావం మొదలైన విషయాలు ఈవ్యాసా లలో పరామర్శించబడినవి. గురజాడవారి గ్రంథాలు నమీక్షించబడినవి. 'మహోదయం' అనే గ్రంథంలో కూడ గురజాడ సాహిత్యాన్ని సాహిత్య జీవితాన్ని పరామర్శిస్తూ, జాతీయ పునరుజ్జీవనంలో ఆయన స్థానాన్ని నిర్ణయించే ప్రయత్నము చేశారు రమణారెడ్డిగారు.

"మహాకవి గురజాడ" అనే గ్రంథంలో దేవులపల్లి ప్రభాకరరావుగారు గురజాడ జీవిత విశేషాలను, సాహిత్య విశేషాలను సమీక్షించినారు. ఈ గ్రంథానికి కేంద్ర ప్రభుత్వ విద్యాశాఖ నిర్వహించిన పోటీలో బహుమతి లభించినది. గురజాడ శతజయంతి సందర్భంలో "ముత్యాల సరాలు—మహాకవి గురజాడ' అనే చిన్న గ్రంథంలో చిట్టిమల్లె శంకరయ్యగారు గురజాడవారి భాషా ఛందస్సులను గురించి వివరించినారు.

కవికోకిల అని గణుతికెక్కిన దువ్వూరి రామిరెడ్డిగారి జీవితాన్ని, సాహిత్యాన్ని సమీక్షిస్తూ కె వి. రమణారెడ్డిగారు "కవికోకిల" అనే గ్రంథాన్ని ప్రకటించినారు. రామిరెడ్డిగారి సాహిత్య పరిణామాన్ని, సాహిత్యంలో ఆయన స్థానాన్ని రమణారెడ్డిగారు సమీక్షించినారు,

శ్రీరంగం శ్రీనివాసరావుగారి కవిత్వంమీద జరగవలసినంత విమర్శ జరగలేదని చెప్పవలసి ఉంటుంది. ఆయన 'మహా ప్రస్థానా'న్ని సమగ్రంగా సమీక్షిస్తూ అద్దేపల్లి రామమోహనరావు గారు ప్రకటించిన గ్రంథం "శ్రీశ్రీ కవితా ప్రస్థానం". శ్రీశ్రీ కవితా శిల్పాన్ని నిరూపించటానికి రామమోహన రావుగారు ప్రాచీనాలంకారిక సిద్ధాంతాలనే ప్రమాణంగా స్వీకరించినారు. ఆ సిద్ధాంతాలను బట్టియే శ్రీశ్రీ మహాకవి అని నిరూపించినారు. ఛందస్సు, కవితా భావన, కథనశక్తి, ఆవేశం, కవితాదృష్టి, ఆలంకారికత, మానవత, ఎలెజీ, దేశ చరిత్రలు, స్వతంత్రమార్గ నిర్మాత అనే శీర్షికల క్రింద రామమోహన రావు గారు శ్రీశ్రీ కవిత్వాన్ని సూక్ష్మదృష్టిలో పరిశీలించినారు. శ్రీశ్రీ మహాకవి అని అక్షరాక్షర శిల్పి అని నిరూపించారు. ఏ విషయాన్ని ఎలాచెప్పినా, ఎందుకు చెప్పినా మహాకవి లక్షణాలు, మహాకవిత్వ లక్షణాలు ఎప్పుడూ ఒక విధంగానే ఉంటవని రామమోహనరావుగారి విమర్శ రుజువు చేస్తున్నది.

గుడిపాటి వెంకట చలంగారి సాహిత్యాన్ని గురించి గొర్రెపాటి వెంకట సుబ్బయ్యగారు 'చలం' అనే విమర్శ గ్రంథం వెలయించారు. చలంగారి రచనలోని తాత్విక విషయాలను, మనో వైజ్ఞానిక విషయాలను వెల్లడిచేస్తూ వెంకట సుబ్బయ్యగారు చలంగారి వ్యక్తిత్వాన్ని సమగ్రంగా చిత్రించడానికి యత్నించారు.

గొర్రెపాటి వెంకట సుబ్బయ్యగారే కవిరాజు త్రిపురనేని రామస్వామి

చౌదరిగారి మీద 'కవిరాజు జీవితం-సాహిత్యం' అనే గ్రంథం రచించారు. చౌదరిగారి సాహిత్యాన్ని, జీవితాన్ని సమీక్షిస్తూ క్రొత్త సత్యనారాయణచౌదరి గారు 'కవిరాజు' అనే గ్రంథాన్ని, త్రిపురనేని సుబ్బారావుగారు 'కవిరాజు జీవితం' అనే గ్రంథాన్ని రచించారు.

త్రిపురనేని సుబ్బారావుగారే 'నవ్యాంధ్ర కవిబ్రహ్మ' అనే పేరున ఏటుకూరి వేంకట నరసయ్యగారి సాహిత్యాన్ని, 'హరి పురుషోత్తం' అనేపేర పురుషోత్తంగారి సాహిత్యాన్ని సమీక్షిస్తూ గ్రంథాలు ప్రచురించారు.

త్రిపురనేని గోపీచంద్ జీవితాన్ని, సాహిత్యాని సమీక్షిస్తూ త్రిపురనేని సుబ్బారావుగారు 'గోపీచంద్ జీవితచరిత్ర', దోనేపూడి రాజారావుగారు 'రచయితగా గోపీచంద్' అనే గ్రంథాలు రచించారు.

నవయుగ చక్రవర్తి అని ప్రసిద్ధి వహించిన జాషువాకవి జీవితాన్ని, రచనలను సమీక్షిస్తూ వారి కుమార్తె శ్రీమతి హేమలతా లవణంగారు తాము ఆయా పత్రికలలో వ్రాసిన వ్యాసాలను 'మా నాన్నగారు' అనే పేరుతో ఒక సంపుటిగా ప్రకటించారు

సురవరం ప్రతాపరెడ్డిగారి జీవితాన్ని, సాహిత్య వ్యాసంగాన్ని సమీక్షిస్తూ ఎల్లి శివారెడ్డిగారు "సురవరం ప్రతాపరెడ్డి జీవితము – సాహిత్యము" అనే గ్రంథాన్నీ, ముద్దసామి రామిరెడ్డిగారు 'సురవరం ప్రతాపరెడ్డి జీవితము – రచనలు' అనే గ్రంథాన్నీ ప్రచురించారు. ఈ రెండు గ్రంథాలకు ఆంధ్రప్రదేశ సాహిత్య అకాదమీ బహుమతి లభించినది.

గడియారం శేషశాస్త్రిగారి శివభారతమును గురించి 'శివభారతోదయము', 'పరాస్త శివభారతోదయము'అనే రెండు గ్రంథాలు ఆకావ్యంయొక్క కర్తృత్వాన్ని గురించిన వాద ప్రతివాదాల రూపంలో వెలువడినవి. సర్దేశాయి తిరుమలరావుగారు 'సాహిత్య తత్త్వము. శివభారత దర్శనము' అనే గ్రంథంలో సాహిత్య తత్వాన్ని గురించి, శివభారత రచనా వైశిష్ట్యాన్ని గురించి విపులంగా పరామర్శించారు.

నరసింహదేవర ఉమామహేశ్వర శాస్త్రిగారు 'నవ్యాంధ్ర పంచకావ్య పరిశీలనము' అనే గ్రంథంలో సౌందరనందము, రాణాప్రతాప సింహ చరిత్ర, శివభారతము, ఆంధ్ర పురాణము, బాపూజీ ఆత్మకథ అనే అయిదు కావ్యాలను సమీక్ష చేసినారు.

మట్టి ఆంజనేయ శర్మగారు 'సాహితీ లత' అనే గ్రంథంలో సుప్రసిద్ధ నవలా రచయిత్రి హేమలతగారి జీవితాన్ని, సాహిత్యాన్ని సమీక్షించినారు.

ఆధునిక సాహిత్యంలోని వివిధ ప్రక్రియలను గురించికూడా కొంత విమర్శ వెలువడినది.

భావ కవిత్వాన్ని సమూలంగా ఖండిస్తూ అక్కిరాజు ఉమాకాంతంగారు 'నేటికాలపు కవిత్వం' అనే గ్రంథం వ్రాశారు. నవ్యకవులైన రాయప్రోలు, పింగళి, కాటూరి, దేవులపల్లి, బాపిరాజు, నండూరి, వేంకట పార్వతీశకవులు మొదలయినవారి కావ్యాలనుండి లక్ష్యాలనుగ్రహించి ఉమాకాంతంగారు ఆకావ్యాలలోని భాష, భావాలు గర్హ్యములని నిరసించినారు. తెలుగు కవిత్వం నన్నయతోనే పతనం కావడం ఆరంభించినది అనే విపరీత ధోరణిలో ఉమాకాంతంగారి విమర్శ సాగినది. ఉమాకాంతంగారి గ్రంథం వారి అపారమైన పాండిత్యాన్ని ప్రకటిస్తున్నదే తప్ప నవ్య కవిత్వ తత్త్వాన్ని ప్రదర్శించడంలేదు. కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారి 'సాహిత్యకళ' అనే గ్రంథం కూడా నవ్యసాహిత్య దూషణకే వినియోగించ బడినది. అనంతపంతుల రామలింగస్వామిగారి 'శుక్లపక్షము' అనే పద్యరచనకూడా నవ్యకవితను పరిహసించడానికి ఉద్దేశించబడినదే.

నేడు ప్రాచుర్యం పొందిన 'వచనకవిత'ను గురించి ఫ్రీవర్స్ ఫ్రంటు వారు ఒక సమీక్ష ప్రకటించారు. వచనకవితమీద పలువురు రచయితల అభిప్రాయాలు, వచన కవితా ప్రక్రియ అవసరము, వచన కవితలోని వస్తు వైవిధ్యం, శైలి, ఆ కవితతోని ముఖ్యసమస్యలు ఇందులో చర్చించబడినని.

'స్వాతంత్ర్యోత్తర కాలాన తెలుగు కవిత' అనే గ్రంథంలో శ్రీ కంఠ, సంపత్కుమార, అద్దేపల్లి. కుందుర్తి, కేతవరపు, బొమ్మకంటి, వరవరరావు మొదలైనవారు అతినవ్య కవిత్వాన్ని, పరామర్శిస్తూ వ్యాసాలు వ్రాసినారు. గౌరవ సంపాదకులైన డాక్టర్ సుప్రసన్న 'నవకవిత – తత్వదర్శనము' అనే వ్యాసంలో జాతీయ భావన, ప్రజాస్వామ్యము, వ్యక్తిసత్వతో ముఖవికాసము, అతినవ్యకవిత ప్రధాన తత్వాలని వివరించారు. "ఫ్రీవర్స్– కొన్ని సమస్యలు' అనే వ్యాసంలో డాక్టర్ మాదిరాజు రంగారావుగారు "ఈనాటి కవిత్వంలో అభ్యుదయకవుల భౌతికవాదం, భావకవుల ఆదర్శవాదం, సంప్రదాయప్రభావం– వీటితీవ్రత తగ్గి ఇవినేటి సామాజిక జీవితానుభవంలో నిగ్గుతేలి వ్యక్తి జీవి

తంతో సమన్వయం పొదుంతున్న సమయం. దీని ప్రతిబింబమే ఫ్రీవర్స్"అని వ్యాఖ్యానించినారు.

విప్లవకవిత్వలక్షణాలను వివరిస్తూ త్రిపురనేని మధుసూదనరావుగారు రచించిన వ్యాసాలు 'కవిత్వం—చైతన్యం' అనే వ్యాససంపుటిగా ప్రచురింప బడినవి.

నవ్య సాహిత్యంలోని కవితాశాఖలనుగురించి సమగ్రంగా, విస్తృతంగా పరామర్శించిన ఉత్తమ విమర్శగ్రంథము డాక్టర్ సి. నారాయణరెడ్డిగారి "ఆధునికాంధ్ర కవిత్వము-సంప్రదాయములు, ప్రయోగములు" అనే సిద్ధాంత గ్రంథము. భావకవిత్వశాఖలు, అభ్యుదయ కవితారీతులు, అతి నవ్య కవితా ధోరణులు, ఈ గ్రంథంలో సమీక్షించ బడినవి ఆధునిక కవితలోని సంప్రదాయ ప్రాబల్యం, ప్రయోగవైశిష్ట్యం నిరూపించ బడినవి.

బసవరాజు అప్పారావుగారి 'ఎంకిపాటల గాలిదుమారం', కృష్ణశాస్త్రిగారి "పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వం" అనే వ్యాసాలు ఈ సందర్భంలో స్మరింపదగినవి.

నవలా ప్రక్రియపైన గూడ కొంత విమర్శ జరిగినది. మొదలి నాగభూషణ శర్మగారి 'తెలుగు నవలావికాసం అనే గ్రంథంలో నవలా లక్షణాలు, తెలుగు నవలా స్వరూపం చర్చించబడినవి. ప్రసిద్ధులయిన రచయితల నవలలు పంద్రెండు పరామర్శింపబడినవి,

డాక్టర్ బొడ్డపాటి కుటుంబరావుగారి 'ఆంధ్ర నవలా పరిణామము' అనే సిద్ధాంత గ్రంథము నవలా సాహిత్యంమీద వెలువడిన విమర్శగ్రంథాలలో సమగ్రమైనది అనవచ్చును. పాశ్చాత్య సాహిత్యంలో నవలా రచనా పరిణామం, తెలుగు నవలా సాహిత్యంలోని వివిధదశలు వివరించబడినవి. ప్రసిద్ధులైన కొందరు నవలా రచయితల గ్రంథాలు విపులంగా పరామర్శించబడినవి. డాక్టర్ రావుగారి విమర్శ శాస్త్రీయంగా, నిష్పాక్షికంగా, సాధికారంగా ఉన్నది.

'తెలుగు నవల — నూరు సంవత్సరాలు' అనే పేర ప్రకటించబడిన గ్రంథంలో తెలుగు నవల శతజయంతి సందర్భంలో పలువురు చేసిన ఉపన్యాసాలు సమకూర్చబడినవి. చారిత్రక నవలను గురించి పిలకా గణపతి శాస్త్రి

గారు, అనువాద నవలను గూర్చి మద్దిపట్ల సూరిగారు, తెలుగు నవలల్లోని కథా శిల్పాన్ని గూర్చి మొదలి నాగభూషణ శర్మగారు, సమకాలీనతను గూర్చి సుదర్శనంగారు, కుటుంబ జీవనాన్ని గురించి శ్రీమతి సి. ఆనంద రామంగారు, మనోవిశ్లేషణాన్ని గురించి డాక్టర్ విశ్వంగారు, భాషాశైలులను గూర్చి దక్షిణామూర్తిగారు వివరించినారు.

"అక్షరాభిషేకము' అనే పేరున గొర్రెపాటి వెంకట సుబ్బయ్యగారు వేలూరి, చలం, మునిమాణిక్యం, బాపిరాజు, గోపీచంద్ మొదలయిన రచయితల కథలను పరిచయం చేస్తూ వ్రాసిన గ్రంథం తప్ప కథానికలను గూర్చిన విమర్శ ఏమీ లభ్యంకాదు.

రూపకసాహిత్యాన్ని గురించిన విమర్శ కొంతవిస్తృతంగానే లభిస్తున్నది పురాణం సూరి శాస్త్రిగారు రచించిన 'నాట్యాంబుజము' నాట్యోత్పలము గొల్లపూడి శ్రీరామశాస్త్రిగారి 'ఆంధ్ర నాటకరంగము', దేకుమళ్ళ అచ్యుత రావుగారి 'ఆంధ్రోనాటకములు', పసుమర్తి యజ్ఞ నారాయణశాస్త్రిగారి 'ఆంధ్ర నట ప్రకాశిక', రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారి 'నాటకోపన్యాసములు' మొదలయిన గ్రంథాలు రూపక లక్షణాలు, కొన్ని నాటకాల రచనా విశేషాలు, పాత్ర రస పోషణాదులు, నాటక ప్రదర్శనము, సుఖాంత దుఃఖాంత నాటకప్రక్రియలు, నాటక వస్తువు మొదలయిన పెక్కు అంశాలను పరామర్శించినవి.

"ఆంధ్ర నాటక పితామహుడు" అనే పేర ఆచార్య దివాకర్ల వెంకటావధానిగారు రచించిన గ్రంథంలో ధర్మవరం కృష్ణమాచార్యులవారి నాటకాలు సమగ్రంగా పరిశీలించబడినవి.

"ఆంధ్ర నాటక కర్తలు" అనే పేర ఆదర్శ సాహిత్య మాలవారు ప్రకటించిన గ్రంథంలో ధర్మవరం కృష్ణమాచార్యులు, వేదం వెంకటరాయశాస్త్రి, కోలాచలం శ్రీనివాసరావు, పానుగంటి లక్ష్మీ నరసింహారావు, చిలకమర్తి లక్ష్మీనరసింహం ప్రభృతుల నాటకాల మీద మంచి సమీక్షలు ఉన్నవి.

భమిడిపాటి కామేశ్వరరావు గారి 'ఆంధ్రనాటక పద్య పఠనం', డాక్టర్ అమరేశం రాజేశ్వర శర్మగారి 'వేదం వెంకట రాయ శాస్త్రిరూపక సమాలోచనము', డాక్టర్ డి వి. ఏ. ఆచార్యగారి 'ఆంధ్రలో నాటకం—

నాటకరంగం', మిక్కిలినేని రాధాకృష్ణ మూర్తిగారి 'ఆంధ్రనాటక కళ', ఆంధ్రప్రదేశ సంగీత నాటక అకాడమీ వారు ప్రచురించిన 'తెలుగు నాటక కర్తలు', శ్రీనివాస చక్రవర్తిగారు ప్రచురించిన లెక్కలేనినాట్య లక్షణ గ్రంథాలు పేర్కొనదగి ఉన్నవి.

"తెలుగులో నాటక వికాసము" అనే పేరున డాక్టర్ పోణంగి శ్రీరామ అప్పారావు ప్రచురించిన సిద్ధాంత గ్రంథంలో నాటక విశిష్టత, ప్రాచ్య పాశ్చాత్య నాటక లక్షణాలు, ప్రాచీనాంధ్ర దేశంలోని నాట్యకళ, ఆధునిక నాటక రచన ఆరంభ వికాసాలు, నాటికలు, ఏకాంకికలు, నాట్యప్రయోగం, నాటకరచన, ప్రదర్శన సమస్యలు విపులంగా చర్చించబడినవి. రూపక సాహిత్యాన్ని విమర్శించే గ్రంథాలలో ఇది సమగ్రమైనదని చెప్పవచ్చును.

ఆధునిక సాహిత్యాన్ని గురించి వెలువడిన విమర్శ వ్యాస సంపుటాలలో ఆర్. ఎస్. సుదర్శనంగారి 'సాహిత్యంలో దృక్పథాలు' 'సమాజము – సాహిత్యము', కొడవటిగంటి కుటుంబరావుగారి 'సాహిత్య ప్రయోజనం', డాక్టర్ కోవెల సుప్రసన్నగారి 'సాహిత్య వివేచన', మద్దుకూరి చంద్రశేఖర రావుగారి 'ఆంధ్ర సాహిత్య పునర్వికాసం', యువభారతివారు ప్రచురించిన 'మహతి' 'రచన' మొదలయినవి పేర్కొనదగియున్నవి.

'మహతి' అనే బృహత్సంపుటిలో ఆధునికాంధ్ర భాషా సాహిత్యాలకు సంబంధించిన పెక్కు విషయాలమీద ఆయా విషయాలలో నిష్ణాతులైన విజ్ఞులు వ్రాసిన నూరు విలువైన వ్యాసాలు ఉన్నవి. 'రచన' లో మారుతున్న విలువలు–రచయితల బాధ్యతలు అనే సమస్యను వివిధ దృక్కోణాలనుంచి పరిశీలించి పలువురు రచించిన వ్యాసాలు ఉన్నవి. ఆధునికాంధ్ర సాహిత్య స్వరూపాన్ని, ఆధునికాంధ్ర రచయితల సమస్యలని అవగాహన చేసుకోవడానికి ఈ రెండు సంపుటాలు ఎంతో తోడ్పడగలవు.

గ్రంథాల రూపంలోనూ, వ్యాస సంపుటుల రూపంలోనూ మాత్రమే కాక స్మారక సంచికలు, సన్మాన సంచికలు, అభినందన సంచికలు, వర్ధంతి–జయంతి సంచికలు, వార్షిక–రజతోత్సవ సంచికలు మొదలయిన ప్రత్యేక సంచికలలో కూడ విమర్శ చోటు చేసుకున్నది. అలాంటి వాటిలో ఈ క్రింది సంచికలు పేర్కొనదగినవి:

శ్రీనాథునకు సంబంధించిన 'చైత్ర జయంతి'. పోతన వర్ధంతి సంచిక, త్యాగరాజ శతవార్షిక సంచిక, వీరేశలింగ వర్ధంతి సంచిక, వీరేశలింగ శతవార్షిక జయంతి సంచిక, గురజాడ శతవార్షిక జయంతి సంచిక, కవిరాజు స్మారక సంచిక, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి శతజయంతి సంచిక, గోపీచంద్ స్మారక సంచిక, "త్రివేణి" మొదలైనవి స్మారక సంచికలు.

విశ్వనాథ అభినందన సంచిక, విశ్వనాథ సాహితి, గిడుగు రామమూర్తి సప్తతి పూర్తి సంచిక "వ్యాస సంగ్రహము", మల్లాది సూర్యనారాయణ శాస్త్రి షష్టి పూర్తి సంచిక. జనమంచి శేషాద్రి శర్మ షష్టిపూర్తి సంచిక, షేక్ ఫరీదు కవి సన్మాన సంచిక, వేదాంత కవికాంతులు, బోయి భీమన్న సన్మాన సంచిక. అయ్యంకి వెంకట రమణయ్య సన్మాన సంచిక "సరస్వతీ సామ్రాజ్యమ్", వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రి షష్టిపూర్తి సన్మాన సంచిక, మాడపాటి హనుమంతరావు పంతులు షష్టిపూర్తి సంచిక, కల్లూరి సుబ్బరాయ శాస్త్రి సన్మాన సంచిక, డాక్టర్ పాటిబండ మాధవశర్మ షష్టిపూర్తి సన్మాన సంచిక "అచ్చరార్చన", అభినవ పోతన వానమామలై వరదాచార్యులవారి షష్టిపూర్తి సంచిక మొదలైనవి సన్మాన సంచికలు.

శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయ రజతోత్సవ సంచిక, సాహితీ సమితి రజతోత్సవ సంచిక, నవ్య సాహితీ సమితి, ఆంధ్ర విశ్వసాహితి ప్రత్యేక సంచికలు, అఖిల భారత తెలుగు మహాసభల సంచికలు, ఆంధ్ర రచయిత్రుల ప్రథమ మహాసభ ప్రత్యేక సంచిక, గోలి ఈశ్వరయ్య రజతోత్సవ సంచిక, ఆంధ్రపత్రిక ఉగాది సంచికలు, భారతి రజతోత్సవ సంచిక మొదలయినవి ఉత్సవ సంచికలు.

తెలుగులో సాహిత్య విమర్శ వ్యాప్తికి పత్రికలు చేసిన సేవ గణనీయమైనది. వీనిలో కొన్ని కలగూర గంపలే అయినప్పటికీ కొన్ని ప్రత్యేకంగా సాహిత్యంకోసమే ప్రవర్తిల్లినవి. అలాంటి వాటిలో పేర్కొనదగినవి.—

సాహితి (1920), కళ (1922), శారద (1923), సారస్వత సర్వస్వము (1923), ఆంధ్రసర్వస్వము (1924). వజ్రాయుధము (1925), ఆంధ్రభారతి (1926), సుజాత (1927), జయంతి (1927), ప్రబుద్ధాంధ్ర (1930) ఆంధ్రభూమి (1933), ఉదయిని (1935), ప్రతిభ (1936), వీణ (1936), ఆంధ్రి

(1939), తరణి (1942), అభ్యుదయ (1946), శోభ (1947), కిన్నెర (1944), సుభాషిణి (1951), శిలి (1953), సంస్కృతి (1953), తెలుగువిద్యార్థి (1953), పరిశోధన (1954), స్రవంతి, (1954), సాహితి (1961), నవత (1963), స్రృజన (1966) మొదలయినవి.

ఆంధ్రదేశంలో పెక్కు సాహిత్యసంస్థలు ఏర్పడి సాహిత్య విమర్శ విస్తరణకు తోడ్పడినవి. అలాంటివాటిలో సాహితీ సమితి, కవితా సమితి, నవ్యసాహిత్యపరిషత్తు, అభ్యుదయ రచయితల సంఘము, తెలంగాణ రచయితల సంఘము, ఆంధ్ర సాహిత్య పరిషత్తు, ఆంధ్ర సారస్వత పరిషత్తు, ఆంధ్ర ప్రదేశ సాహిత్య అకాడమీ, యువభారతి, కళాస్రవంతి, నవోదయ మొదలయినవి సాహిత్యోపన్యాసాలను, సాహిత్య చర్చలను ఏర్పాటుచేసి ఉత్తమ సాహిత్యాభిరుచి పెంపొందించడానికి పాటుపడుతున్నవి.

తెలుగు సాహిత్యవిమర్శ విస్తరించటానికి 'ఆకాశవాణి' మద్రాసు, హైదరాబాదు, విజయవాడ కేంద్రాలు చేస్తున్న కృషికూడ గణనీయమైనది.

దిన వార పక్ష మాస పత్రికలలో వెలువడుతున్న గ్రంథ సమీక్షలు, వందలకొలదిగా ప్రకటించ బడుతున్న గ్రంథాలకు సమకూర్చ బడుతున్న పీఠికలు సాహిత్యవిమర్శ ప్రచారానికి ఎంతో సహకరిస్తున్నవి.

తెలుగు సాహిత్యాన్ని గురించియే కాక ఇతర సాహిత్యాలను గురించి కూడా తెలుగులో విమర్శలు వెలువడుతున్నవి. బహుభాషాకోవిదులైన సహృదయులు భారతీయ, భారతీయేతర, భాషలలోని సాహిత్యాలను తులనాత్మకంగా పరిశీలించి తెలుగువారిలో విమర్శనా శక్తిని, ఉత్తమ సాహిత్యాభిరుచిని పెంపొందిస్తున్నారు.

ఈ విధంగా తెలుగులో సాహిత్య విమర్శ అక్షరబద్ధమై అందరికి అందుబాటులోనికి రావడం మొదలయిననాటినుంచి ఛందో వ్యాకరణాలంకారాది బహిరంగాల సాధుత్వాసాధుత్వాల చర్చలతో ఆరంభమై, కథా నిర్వహణ, పాత్ర చిత్రణ, వర్ణనౌచిత్యాదులయిన ఆంతర విషయాలను పరామర్శిస్తూ పురోగమించి, రసానుశీలనము, పరమార్థ నిరూపణము మొదలైన అంతస్తత్వ దర్శనము వరకు సాగినది. కావ్యాంగములను వ్యష్టిగా, కావ్యాన్ని సమష్టిగా

పరిశీలించినది. మారుతున్న కాలాన్నిబట్టి మారుతున్న సాహిత్యాన్ని మారుతున్న విలువలతో వెలకట్టడం అలవరచుకున్నది, సర్వసాహిత్య ప్రక్రియలను సర్వభాషా సాహిత్యాలను సమదృష్టితో ఆస్వాదించే సహృదయతను ఔదార్యాన్ని తెలుగు జాతికి అలవరుస్తున్నది.

ఈ వ్యాసాన్ని వ్రాయడంలో ప్రధానంగా తోడ్పడిన గ్రంథం డాక్టర్ యస్. వి. రామారావుగారి "తెలుగులో సాహిత్య విమర్శ"అనే సిద్ధాంత గ్రంథము. ఈ వ్యాసంలోని సామగ్రి ప్రధానంగా ఆగ్రంథంలోనుంచి సంగ్రహింపబడినదే కొంత కొంత తోడ్పడినవి యువ భారతివారు ప్రచురించిన 'మహతి', 'రచన' అనే వ్యాస సంకలనములు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు ప్రచురించిన "సారస్వత వ్యాసములు" — ప్రథమ సంపుటానికి డాక్టర్ జి. వి. సుబ్రహ్మణ్యంగారు వ్రాసిన పీఠిక. తెలుగులో సాహిత్య విమర్శను గురించి విపులంగా తెలుసుకోదలచినవారు పై గ్రంథాలను సంప్రదించవచ్చును.

ఇతి శివమ్